సరస్వతీ గ్రంథమండలి:

# వరుడు కావలెను

కథలు

పి. వి. యల్. నరసింహారావు, బి. ఎ., బి. ఎల్.




పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# VARUDU KĀVALENU

(Short Stories)

by

P. V. L. Narasimha Rao, B. A., B. L.

First Edition August - 1960 Price Re. 1/-

Copy Right reserved by the Publishers:



Publishers: ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

# విషయసూచిక

# ఒక్క మాట

ఈ పుస్తకంలో వున్న ఎనిమిదికథల్లోను ఒకటి ప్రజా రాజ్యంలోను, ఒకటి కథాంజలిలోను, ఒకటి ఆంధ్రవార పత్రికలోను, మిగిలిన ఐదూ ఆంధ్రప్రభ వారపత్రికలోను యిదివరకే ప్రచురింపబడ్డాయి.

వీనిని మొదటిసారిగా పాఠకలోకానికి పరిచయంచేసిన ఆ యా పత్రికాధిపతులకు, పుస్తకరూపంలో ప్రచురిస్తున్న అద్దేపల్లి అండ్ కో వారికి నా కృతజ్ఞత.

# భార్యాభర్తలు-!

ఎక్కడికి వెళ్ళారండీ ?

పోస్టాఫీసుకు.

ఎందుకూ ?

ఉత్తరం పోస్టు చేయడానికి.

ఇంతసైము పట్టిందా ?

అరగంటేకదా వెళ్ళి !

ఉత్తరం పోస్టుచేయడానికి అరగంట పట్టిందీ ?

తోవలో శంకరంగారి యింట్లోకి తొంగిచూచి వచ్చానులే!

అలా సెలవియ్యండి. బాగున్నారా ఆలుమగలు ?

ప్రస్తుతం బెడిసింది వాళ్ళ కథ !

అరే ! వింతగావున్నదే, ఏమిటి విశేషం ?

నేను వచ్చేటప్పటికి శంకరం ఆవిడను జుట్టుపట్టుకొని లాగుతున్నాడు.

ఎంత అఘాయిత్యం !

ఆవిడ ఆరున్నొక్కరాగం ఆలపిస్తూయున్నది.

ఘోరం! యెప్పుడూ అంతే—అతనికి శాంతను వేధించటం తప్ప వేరేపని లేనట్లున్నది.

తప్పంతా ఆవిడదైనప్పుడు అతనేం చేస్తాడు ?

నేను శాంతను మెరక్కపోతే యింకా యెన్నయినా కోస్తే వారే – నిజంగా ఎంత శాంతమో దానికి! ఇంతకూ అసలు సంగతేవిటి ?

ఆవిడగారి గయ్యాళితనం !

బాగానేవున్నది మీ వరుస. మీకు స్త్రీలంటేనే పడదు అసలు.

అందుకనే అసలు వాదనలోకి దిగటంఅంటే నాకు చెడ్డ తలనొప్పి !

దీనిని వాదన అనరులెండి, సంభాషణ అంటారు. ఇక్కడ యెవరూ మీతో వాదించటానికి బొడ్డుకు మసిపూసుకొని సిద్ధంగా లేరు. నేను ఇలా అణగిమణగివుండబట్టే మన సంసారం హాయిగా సాగుతున్నది.

అయితే నేను మాత్రమో ?

ఈ సంభాషణకు దూరంగా వుంటానని తమ రన్నట్లు జ్ఞాపకం !

రవణా ! నేను కొన్నిసార్లు అనుకొంటానుగదా......

పాపం, శాంత గుండెలు పగిలిపోయేటట్లు ఎందుకు యేడుస్తున్నదో ? ఆవిడ భర్త యేదో ఘోరం చేసివుంటాడు, మూర్ఖుడు !

నేను అలా అనుకోను.

ఆయనగారిని తమరు వెనకేసుక రానక్కరలేదు.

నేనేమీ వెనుకేసుకరావటంలేదు. అతగాడేమన్నా అపరాధంచేస్తేగదా వెనుకేసుకరావటానికి?

"గురివిందగింజ..." సామెతగా తమరు జేస్తున్న ఘన కార్యం యేమిటండీ ?

అసలు జరిగిన విషయం తెలీకుండానే శాంతాదేవిగారి వకాల్తు పుచ్చుకున్నారు. మాట్లాడేదానికి కొంచం అర్థమూ పర్థమూ వుండాలి.

అబ్బబ్బా, యీగొడవతో తలబద్దలయిపోతున్నది బాబూ!

గొడవా ! యిందులో గొడవేమున్నది ? నాకు పెండ్లయిన నాటినుండి మనం గొడవనేదే యెరుగం. గొడవంటేనే నాకు గిట్టదు. నీవు యిష్టంవచ్చినట్లు తలబిరుసుగా వాగుతున్నా నేను మెదలకుండా వుండబట్టేకదా మన కాపురం హాయిగా సాగుతున్నది. లేకపోతే యేనాడో భగభగ మండిపోయేదే ?

కొంచెం యీ భాగవతం ఆపి, దయచేసి, శంకరంగారి యింట్లో ఏంజరిగిందో సెలవిస్తారా ?

నేను వాళ్లయింటికి వెళ్లినప్పుడు వాళ్లు ఒకరితో ఒకరు మాట్లాడుకోవటంలేదు. మేము యిద్దరమూ సోఫామీద కూర్చొన్నాము. శంకరం ఆవిడగార్ని కొంచెం సిగరెట్టుపెట్టి అగ్గిపెట్టె తెమ్మని కేకవేశాడు. ఆవిడగారు యివతలకు ససేమిరా కదిలితేగా ! వ్రూహించు ! తన స్నేహితుడి యెదుట హిందూధర్మశాస్త్రప్రకారం కట్టుకొన్న భర్తనా యింత అవమాన పరచటం! ఎంతమొండిధైర్యం! ఎంతమొండి ధైర్యం!!

తమరు చిలవలు పలవలు చెక్కనక్కరలేదు. జరిగినది జరిగినట్లు సెలవిస్తే సంతోషిస్తాము.

హాట్, ఆవిడగారు రానే రాలేదు. కాని తెరవెనుకనుండి చిలుకలా పలికింది. ఒకరితో ఒకరు మాటాడుకోవటం మాని వేసారు గాబట్టి తను అతని ఆజ్ఞలను పరిపాలించ లేవట!

భేష్, శాంతా! సిసలైన పనిజేసావ్.

పొగరు మోతుతనం, తన్నేవాళ్లులేక! ఆవిడగారిని యీ విడగారు మెచ్చుకోవటం, బాగు బాగు!

నేను శాంతను యేమీ పొగడటంలేదు. అసలు వాళ్లు మాటాడుకోవటం యెందుకు మానివేసేరో యింతవరకు చెప్ప నేలేదు మీరు. శంకరం నిజంగా ఒఠి దున్నపోతే!

నిజంగానే వఠి పిరికివెధవ! అవమానంతో ధుమ ధుమ లాడిపోతున్న వెధవమొఖాన్ని క్రిందకు వేలాడేసికొని యెదురుగావున్న గాలినిచూచి యికిలిస్తూ నోరుమూసుకొని కూర్చొన్నాడు దద్దమ్మ! నేనేగనుక వాడిస్థితిలో వుంటేనా? నేను... నేను...

ఓ అవును. కొంచెం యీసంభాషణకు దూరంగానే వుండండి తమరు. తరువాత యేమయింది?

ఏమయిందా? చంటిపిల్లాడిలాగ బిగ్గరగా విలపించి తన విషాదగాధను వినిపించాడు. ఒక్కముక్కలో చెప్పాలంటే అసలు ప్రక్కయింట్లో వుంటున్న నారాయణ సుభద్రమ్మగార్ల కాపురంగురించి వీరిద్దరికీ వాదన బయల్దేరింది. కొంతమందికి ఇదొక జబ్బు! వాళ్ళసంగతేదో వాళ్ళుచూచుకొని గుట్టు చక్కంగా వుండలేరు. ఇతరులనుగురించి యేదోఒకటి వాగుతూనే వుంటారు. సరైన విద్యా సంస్కారాలు లేకననుకొంటాను. శంకరం నారాయణవైపు, శాంత సుభద్రవైపు వకాల్తు

పుచ్చుకొని దిగారు రంగంలోకి. పర్యవసానం శంకరం ఆవిడ జుట్టుపట్టుకున్నాడు. శాంతాదేవి నీటికోళ్ళాయి మీాటనొక్కింది. శాంతకు అంతిపిచ్చి ఎందుకో నాకు అర్థంకాదు. తనగొడవేదో తనుచూచుకోక, సుభద్రమ్మ యెలాపోతే తనకెందుకు? స్త్రీలు అసలు ఆమాత్రం ఇతరుల గొడవలో వేలుపెట్టకుండా వుండలేరు గాబోలు!

తప్పంతా శాంతనెత్తిమీాదనే రుద్దుతారెందుకు?

పుర్రెతోపుట్టిన బుద్ధి పుడకలతోనే అన్నట్లు, శాంత యెప్పుడూ గయ్యాళిగంపే.

శాంత నా ముఖ్యమైన స్నేహితురాలనే సంగతి మీారు మరచిపోతున్నారు.

ఆవిడ నీ స్నేహితురాలని చెప్పుకోవటం గొప్ప అనుకొంటున్నావా? ఇకమీాదట నీవు ఆ సంస్కారం లేని గొడ్డుతో యేమీా సంబంధం పెట్టుకోవద్దు, తెలిసిందా?

ఏమన్నారు? నా స్నేహితురాలినిగురించి కొంచం మంచి భాష వుపయోగిస్తే మర్యాదగా వుంటుంది.

ఎవరనుకున్నావు నన్ను-శంకరం అని అనుకొన్నావా?

మరి ఎవరు?

ఇక చాలు నీతో ఇకమీాదట ఒక్కమాటకూడా మాటాడదలుచుకోలేదు. తెలిసిందా? ఒక్కమాటకూడా!

ఓ! బాగా గుర్తుంచుకోండి. ఆ మాటమీాదనే వుండండి. నేను శాంతదగ్గరకు వెళుతున్నాను.

అరే!

ఇకమీాదట - ఒక్కమాటకూడా! (ఆధారం: ఆంగ్లకథ)

# సీలి జార్జెట్

వర్షం జోరు యింకా పూర్తిగా తగ్గలేదు. కిటికీ తలుపులమీద పడుతున్న నీటిబొట్లు టపటపమని శబ్దం చేస్తున్నవి. గాలికి కదలుతున్న చెట్లకొమ్మలనుండి నీరు జలజలమని నేలకు జారుతున్నది. చల్లని పిల్లతెమ్మెరలు పూవుల తావులను మోసుకొని వీస్తున్నయి. ఆకాశంలోని ఆషాఢ మేఘాలు అటూ యిటూ పరుగులు పెడుతున్నాయి. ఆ మేఘాలను చొచ్చుకొని బైటకు రావాలని భాస్కరుడు ప్రయత్నిస్తున్నాడు. ఆ సాయంకాలపు పూట ఎంతో మృదుమధురంగా వినవస్తున్నది ప్రకృతి పాడుతున్న సౌందర్యపు పాట.

పడక కుర్చీలో పడుకొని పుస్తకం చదువుకొంటున్న పురుషోత్తం శ్రీమతి చిలిపి పిలుపు విని తలఎత్తి చూచాడు.

"టీ చల్లారిపోతున్నది" కోకిల కూసినట్లు, వీణియె మీటినట్లు వినవచ్చింది పురుషోత్తానికి శారదఅన్న ఆ చిన్న వాక్యం.

పుస్తకాన్ని ముడిచి బల్లమీద పెట్టిన పురుషోత్తం చేతికి టీ కప్పును తీసుకొన్నాడు.

శారద అతనివైపు కొంటెగా చూస్తున్నది. పురుషోత్తం టీ త్రాగటం పూర్తయింది.

"ఏమండీ...యింతకూ...బావుందా ?"

"వో...చాలా బాగుంది. పానకంలా వుంది."

"ఏమిటండీ ?"

"ఏముంది ? టీ."

"బాగానే వున్నది. టీ కాదండి"

"పుస్తకమా ? బాగానే వున్నదనే అనాలి. రచన చాలా బావుంది. శైలీ, టెంపో గింపో, అన్నీ మధ్యరకం. పాత్ర పోషణమాత్రం కొంచెంగా పాడయిం దనుకొంటాను."

"బాగానేవున్నది. ఊరకనేనా అందరూ అనేది పురుషోత్తం పుస్తకాల పురుగూ అని...మీ పుస్తకం సంగతి ఎవరడిగా రండీ...?"

"హోహోహో... తెలిసింది. ఈ వాతావరణం బావున్నదా అని అడుగుతున్నావు గదూ? నిజంగా కవిత్వం వ్రాయాలన్నా, కథలూ గిథలూ గీయాలన్నా, చాలా చక్కని చల్లని వాతావరణం. చూడు, నీ కురుల సోయగాన్ని చూచి సిగ్గుతో తలలు వంచుకొని పారిపోతున్నాయి ఆ అందాల మేఘ మాలలు...నీ లేత గులాబీ బుగ్గల సొగసు జూచి బైటకు రావటానికి భయపడుతున్నాడు భానుడు ... చూశావా శారదా ! యీ..."

"చాలు,చాలు. కాళిదాసుగారి కవిత్వం, పురుషోత్తంగారి పైత్యం...మిమ్మల్ని యివన్నీ ఎవరడిగారండీ...?"

"మరి ఏమిటి నీవు బావుందా అని అడిగింది?"

"మరీ బావుంది. నన్ను చెప్పనిస్తేగా...అదండి...అది..."

"ఇది యింకా బావుంది. అదండీ అది...అంటే నా కెలా

తెలుస్తుంది ? టీ గాదు, పుస్తకం గాదు, ప్రకృతీ గాదు...
మరి ఏమిటి బావుంది ?''

''బాగానే వుంది మీా బాణీ. ఇంత మతిమరుపు మనుషు లేమండి...మధ్యాహ్నమేగా అనుకొంది. ఇంతలో...''

''ఆ తెలిసెన్..."వరుడు కావాలి''...కదూ?''

''వరుడు ఎవరికి కావాలండీ ?''

''అబ్బబ్బా ! ఈ సస్పెన్సు సస్పెండుచేసి చంపెయ్యక చెప్పేద్దు బాబూ ! ఏమిటో ఆ బావున్నది ?''

''అది కాదండి సరోజిని...''

''వోహో ! సరోజినా ? సరోజిని కేం ? అందులో యిప్పుడు గెజిటెడ్ ఆఫీసరు భార్య ! బాగానే వుంటుంది గాని అయినా నీ కాలిగోటికిగూడా రాదు. మరీ ఆ లిప్‌స్టిక్, హెయిర్ నెట్...ఛా...ఛా పచ్చి భోగంపిల్లలాగా...''

''అబ్బబ్బా చంపేస్తున్నారు. చెప్పేది పూర్తిగా వినకుం డానే మధ్యలోనే అందుకోవటం. ఒకటే కంగారు. కొంచెం గుర్రాన్ని కట్టేస్తే ఏం ?''

''మరి నీవేగా సరోజిని...అన్నావు యిప్పుడు.''

''సరోజిని కాదండి...పొద్దున సరోజిని కట్టుకొని వచ్చింది చూశారా...అది...ఆ నీలిరంగు జార్జెటు చీరె!''

''వచ్చిరి సోదరుల్...బలే బలే...చీరెకువచ్చిన తిప్పీరీయా ఇది ? మొత్తానికి ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించావు. వో...ఆ చీరె నిజంగానే చాలా బావుంది...''

"మరి...మరి...ఎలాగూ మా అక్కయ్యకూతురి పెండ్లికి వెళ్ళాలి కదండీ..."

"అవును! తప్పకుండా వెళ్ళాలి...అందులో అక్కయ్య కూతురి పెండ్లి...వెళ్ళకపోతే ఏమనుకొంటారు? ఎప్పుడో ఒక్కసారి వచ్చేది..."

"బావుంది. అందరూ ఒక్కసారి గాక ఎన్నిసార్లు చేసికొంటారు?"

"ఇది మరీ బావుంది. ఏదో మాటవరస కన్నాను. ఆ! యింతకూ మీ అక్కయ్య కూతురు పెండ్లికి వెళ్ళాలి..."

"వెళ్ళాలి. చిత్తం! ఆసంగతి తమరు యిన్నిసార్లు చెప్పక్కర్లేదు. అంత తెలీనట్లు నటిస్తే నేనేంచేసేది?"

"అరే, వెళ్ళమన్నాను గదా? ఇంకా ఎందుకు గొడవ?"

"వెళ్ళమన్నారు...భేష్...మీకేం మగమహారాజులు... మీరే చెప్పండి...ఎలా వెళ్ళటం? కట్టుకోను ఒక్క అనువైన చీరెఅయినా లేదుగదా...మీరు కొంచెం ఆలోచించండి... నలుగురూ ఏమనుకొంటారు? కాపురానికి పోయి నాలుగేండ్లయినా..."

"అదా? అసలు పాయింటు! అంటే ఆ చీరెలాంటిది ఒక చీరె తమరికికూడా కావాలన్నమాట...అంతేగా?"

"అంతేగా? తమరికి తెలీనట్లు...నా నోటిచేత చెప్పించాలని తప్ప..."

పురుషోత్తానికి నిజంగానే జాలివేసింది. కాని, తనను చూసి జాలిపడేవా రెవరు?

"నీకుమాత్రం తెలీంది ఏముంది శారదా ! మన బడ్జెటు సంగతి. అచ్చం భారత ప్రభుత్వం బడ్జెటేగా ? కాకపోతే, ప్రభుత్వంగాబట్టి ప్రజలమీద పన్నులు వేస్తుంది...మనం వేస్తే మరి మామగారు చెల్లించకపోయినా ఏ కోర్టూ శిక్షించదు..."

"చాలులెండి...చేతగాకపోతే సరి...మాటాడితే మామ గారు, మామగారు...! మామగారు ఎక్కడినుండి తెస్తారు. మాటిమాటికి ... అల్లుళ్ళకు దోచిపెట్టి గోచీ పెట్టుకోని పోమ్మంటారు...అంతేగా?"

"అంతమాట నా నోటితో అంటానా ... యింతకూ ఆ చీరె ఎంత వుంటుందంటావు ?" పురుషోత్తం వాదన కొంచెం రాజీబేరంలోకి వచ్చింది. శారదకూడా ఆ ముహూర్తంకోసమే ఎదురు చూస్తున్నది.

"నేను సరోజినిని అడిగానండి. ఎంతో లేదు. పాతిక మాత్రం !"

"పాతిక మాత్రం ! భలే ! పాతిక నయాపైసలుగూడా లేవు మనదగ్గర...నీవే చెప్పు ఏం చేయమంటావో ?"

"అయితే నేను చెప్పినట్లు చేస్తారా ? అసలు మీకు ఆ చీరె కోనాలని మనస్ఫూర్తిగా వుందా లేదా, ఆ సంగతి చెప్పండి ముందు ?"

"ఓ, యిష్టమా ? ఇష్టమైతే బోల్డంతవుంది."

"ఇష్టంవుంటే కష్టం ఏముంది ? కొంచెం మనఖజానా కదిలించండి...అంతే !"

"నిజం చెప్పనా? ప్రెసిడెంటు ఎమర్జన్సీ డిక్లరేషనులాగా రాణిగారి దగ్గరనుండి యిలాటి అత్యవసరమైన హుకుూం ఏదన్నా జారీ అవుతుందేమోనని ఒక పదిరూపాయలు మాత్రం దాచివుంచాను. మరి, యింకా పదిహేనురూపాయిలు! సరోజిని కేం? పాతికగాదు నూటపాతిక అయినా పెట్టి కొనగల స్తోమతవుంది. వాళ్ళ ఆయన ఇప్పుడు గెజెటెడ్ ఆఫీసర్! అందని దానికి అర్రులు సాచటం ఎందుకు? నా మాటవిని యీ పదిరూపాయిలు పెట్టి ఏదో ఒకచీర కొనేద్దూ. ఏమంటావు?"

"చీర కొనటానికి యిష్టంలేదని చెప్పరాదూ?"

"ఇష్టంవున్నదని యిప్పుడేగా చెప్పాను."

"మరి నేను చెప్పినట్లు చేస్తానన్నారుగా."

"ఇప్పుడు మాత్రం చేయనంటేగా ... అంటే ... దొంగతనాన్ని తప్పిస్తే..."

"ఛా ఛా...నాకు మాత్రం పిచ్చి యెక్కిందనుకున్నారేమిటి?"

"మరి అయితే ఏం చేయమంటావు?"

"సరోజిని వాళ్ళ ఆయనా మీరూ చిన్నప్పటినుండి ఫ్రెండ్సేగా...?"

"ఆ...అప్పారావుకు, నాకు మంచి స్నేహం వుంది. ఆ మాట నిజమే!"

"అయితే...అప్పారావు దగ్గరకుపోయి ఒక పదిహేను

రూపాయిలు అప్పు పుచ్చుకోండి. మళ్ళీ యిచ్చెయ్యొచ్చు... ఎలాగూ...మీరు పంపిన కథకు పదిహేను రూపాయిలు వస్తాయి గదా ?"

"అప్పే! అందులో అప్పారావు దగ్గరనా ? నీకు తెలీదూ, నేను ఎవరినేనా అప్పు అడిగానా యింతకుముందు ? అప్పు పుచ్చుకోవటం అంత మంచిపనికాదు."

"మీ పాలసీ మంచిదేగాని...అది ఏ జమీందారులకో చెల్లుతుంది...మనలాంటి మధ్యతరగతివాళ్ళ కు యిచ్చిపుచ్చుకోవటాలు లేకుండా ఎలా జరుగుతుందండీ...? అందుకనే అప్పిచ్చువాడు లేనివూరులో వుండగూడదని సుమతీ శతకకారుడు స్వాత్రీకరించింది..."

"నీవు చెప్పింది బాగానేవుంది ... ఇంతకూ అప్పారావు లేదంటూ డనుకో...అప్పుడేం చేయాలి ?"

"బాగానే వుంది, శుభం పల్కరా మంకెన్నా అంటే... అన్నట్లు ఆలూ చూలూ లేదు. మీరు అడగందే అసలు?"

"సరే. నీయిష్టం, అలాగే ట్రై చేస్తాను. అర్థాంగి అలుక బోనులో ఎలుకలాటిది అన్నారు పెద్దలు. మరి, వెళ్ళొస్తాను. ఏదీ, ఒక..."

"మళ్ళీ వచ్చిన తరువాత..." అంటూ ముక్కుమీద వేలువేసికొని "తప్పుగదూ!"అంటూ పురుషోత్తాన్ని తప్పించుకొని లోపలకు పారిపోయింది శారద.

పురుషోత్తం చెప్పులు తొడుక్కొని, అప్పారావు యింటివైపు బయల్దేరాడు.

* * * *

శారద అందమయింది అంటేచాలదు. చిన్నారిమోముపై చిరునవ్వులను చిందించే శారద, శారదరాత్రి చంద్రికలను స్మృతికి తెస్తుంది. జగత్తులోవున్న సౌందర్యాన్నంతా ఒకచో చేర్చి పోతపోసి విశ్వశిల్పి నిర్మించిన పసిడి శలాకలా మిసమిస లాడుతుంటుంది. ''అందంలో ఆనందం వుంది'' అన్న నానుడి శారదను చూసి పుట్టిందే నేమో! కాని, శారద తన అంత స్థుల అవధులను తెలుసుకోలేని అజ్ఞానంలో లేదు. తను ఒక మధ్యతరగతి కుటుంబీకుని యిల్లాలు! తీరని కోరికలతో బాధల గాధలను సృష్టించదలచుకోలేదు. అందుకనే పురుషోత్తానికి గూడా ఆ అమ్మాయి అంటే అంతప్రేమ! అప్పు చేయటం నిజంగా అతనికి యిష్టంలేదు. "వందరూపాయల నోటుమార్చి ఇస్తాం...ఒకటో తారీఖు తిరక్కముందే ఇచ్చేస్తాంబ్రదర్..." యిలా రకరకాల మాటలుచెప్పి అప్పుచేసి పప్పుకూడు తినే రకం తనకు చాలామంది తెలుసు. అప్పుపుచ్చుకోవటం అర్హతే నాలుగు కళలలో వున్నదో లేదోనని అనుమానం వేసింది అతనికి...! కాని, తనకు అప్పు చేయటంలో అనుభవం లేదని మాత్రం చెప్పకతప్పదు.

వర్షం పూర్తిగా వెలిసిపోయింది. రోడ్లన్నీ శుభ్రంగా మలినం కడిగివేయబడిన ఖడ్గాలలాగా తళతళమని మెరుస్తు న్నాయి. మేఘాలు పూర్తిగా మాయమయిపోయాయి. సంజ వెలుగు పసిడిఛాయలు రోడ్ల అంచులమీద పడుతున్నాయి. రోడ్లు పసిడి జలతారు చీరెలు ధరించిన పడతులులాగా అగు పిస్తున్నాయి. పురుషోత్తం నాలుగురోడ్లూ కలిసే నడిబజారు

దగ్గరకువచ్చాడు. కార్లు ఒకదాని వెనుక ఒకటి నిలబడివున్నాయి. ట్రాఫిక్ క్రమక్రమంగా ఎక్కువ కాసాగింది. కారును తప్పించు కొని రోడ్డు క్రాస్ చెయ్యాలని ఒక కాంతామణి ముందుకు వచ్చింది. ఆమె ధరించిన సన్నని చీరె పయ్యెద గాలికి లేచి నాట్యం చేస్తున్నది. కారుక్రింద పడకుండా ఆమెకు సాయం చేసేందుకు పరుగిడుతూ ముందుకు వచ్చాడు ట్రాఫిక్ కానిస్టేబుల్ !

పురుషోత్తం నవ్వుకొంటూ ముందుకు నడిచాడు. అతడు అప్పారావు యింటి సమీపానికి వచ్చేసరికి ప్రక్కనున్న క్లాక్ టవర్ ఆరుగంటలు కొట్టింది. తీరుతీరులుగా బారులుతీర్చి అమర్చబడిన క్రోటన్సు గాలికి తలలు ఊపుతూ ఆనందంతో ఆగంతకులను ఆహ్వానిస్తున్నవి. అప్పారావు స్నేహితుని చూసి ఎంతో సంతోషించి లోపలకు తీసికొని పోయాడు.

సోఫాలో తాపీగా కూర్చొన్న బాల్యమిత్రులు యిద్దరూ సిగరెట్లు ముట్టించి బాతాఖానీ ప్రారంభించారు.

"ఏరా, పురుషోత్తం! బొత్తుగా కనపట్టం మానేశా వేమోయ్ ?"

"కాయ్, ఆఫీసరు అయిన తరవాత అయ్యగారి దర్శనాలే లేవు. బై ది బై ఎలా వుందిరా ఆఫీసరు గిరి...?"

"చెప్పక చెప్పక మనసంగతే చెప్పాలా ? 'చెప్పవలెనే ఆ అయ్య సౌభాగ్యముల్' అని అన్నట్లుంది."

"ఏమొచ్చిందోయ్ నీకు ? అందరూ ప్రమోషను రాలేదో అని అఘోరిస్తుంటే!"

"రాకుండా వుంటేనే బావుండే దనుకొంటాను."

"బావుంది. ఇంతకూ ఏమిటి నీ బాధ?"

"బాధా? బాధ ఏమీలేదు. ఈ టీ త్రాగెయ్ చెబుతాను."

నౌకరు బల్లమీద తెచ్చిపెట్టిన టీ కప్పులు రెండు ఖాళీ చేసేశారు యిద్దరు స్నేహితులు.

"అరేయ్, నీవు నమ్ముతావో నమ్మవోగాని... గెజెటెడ్ ఆఫీసరు అయిన తరువాత నా అవస్థ భగవంతుడికే తెలియాలి... పెరిగిన ఉద్యోగంతోపాటు సొసైటీలో నా అంతస్థు యింకా ఎక్కువ పెరిగిందన్న మాట...పాయింటు బై పాయింటు చెబుతా విను...ఇదివరకు ఇంటిక్రింద నూటికి ఏడురూపాయిలు కట్ చేసుకొనేవారు...యిప్పుడు నూటికి యిర్వై..."

"దాని దేముంది లే?"

"దానిది ఏమీలేదనుకో. అసలు చెబుతాను విను. పిల్లలే వున్నారనుకో. ఇదివరకు జీతాలుకట్టే పనిలేదు. ఇప్పుడు ఆరుగురికీ జీతాలు కట్టాలి...అది అలావుంచు...అమ్మాయిలూ అబ్బాయిలూ అందరూ యిప్పుడు తామే గెజెటెడ్ ఆఫీసర్లు అయిపోయినట్లు అనుకొంటారు...షార్క్ స్కిన్, పెనామా, సిల్కు, వెల్వెటు...యివి తప్ప వేరేగుడ్డ పనికేరాదు. కొంచెం చిరుగుపడితే పనిమనిషికి! దానకర్ణులు బ్రదర్ దానకర్ణులు!!"

"మిస్టర్! ఉన్నవాడు చెయ్యకపోతే ఎవరు చేస్తారోయ్?"

"దేనికైనా అంతు వుండాలిగదా? అదీ నేననేది. ఇంక బడిలో...చదువు సంగతి అలా వుంచెయ్...నెలకు యిర్వై

తొమ్మిది రోజులు విందులు వినోదాలు.. .అందులో అందరికీ అందకుండా వుండాలి మన చందాలూ గిందాలు...'మీనాన్న గారికేమయ్యా గెజెటెడ్ ఆఫీసరు' అంటారు బడిపంతుళ్ళు. మనంపడే బాధలు వారికేం తెలుస్తయి ?''

ఆరిపోయిన సిగరెట్ పురుషోత్తంచేతిలో వ్రేలాడుతున్నది. నోరు తెరచి స్నేహితుడు చెప్పుకుపోయేదంతా శాంతంగా వింటున్నాడు.

''ఏరా ? ఏమంటావు ? ఇక నామటుకు నేనున్నానా ? సిటీబస్‌లో వస్తే పరువు తక్కువ. రిక్షాలో రావాలి రోజూ యింటికి... ఒక రేవిటి? అందరకూ! ప్రపంచం దృష్టిలో నేను గెజిటెడ్ ఆఫీసరును ! ! పాలమనిషి, పనిమనిషి, కూరగాయల వాళ్ళు...వీళ్ళందరి దృష్టికీ నేను నైజాం నవాబును! నా దగ్గరనుండి ఎంత వసూలు చేసినా పాపంలేదు. ఏదో చెబు తారు చూశావూ ? 'డాబుసరి బావా అంటే డబ్బులేదు మరదలా' అన్నట్లుందిరా బ్రదర్ మన పని.''

''అదే మనవాళ్ళంటుంటారే, ఎంతచెట్టుకు అంతగాలని... అందుకే !''

''ఇప్పుడు నా బాంక్ బాలెన్సు ఎంతో చెబితే విస్తుపో తావు... రెండు రూపాయిల యిరవైరెండు నయాపైసాలు !''

''ఆ...!'' అన్నాడు ఆవలిస్తూ పురుషోత్తం.

''ఆ...ఏమిటి బ్రదర్ ! ఇంకా వారం గడుస్తేగాని జీతాలు రావు. ఈలోపల కావలసినన్ని బాకీలు, మొన్ననే పదిరూపా

యిలు వుంటే యింకొక పదిహేను కామేశం దగ్గర బదులు తీసికొని మా ఆవిడకు ఒక జార్జెట్టుచీరె కొన్నాను. అదే.... పొద్దున మీ యింటికి వచ్చేటప్పుడు కట్టుకొన్న దే...అది''

''అలాగా ?''

''చస్తున్నా రా, నీవు నమ్మవుగాని నానాతిప్పలూ పడుతున్నా ననుకో...ఒక్క పదిరూపాయిలుంటే సర్దుదూ...మళ్ళా ఫస్టుకు యిచ్చేస్తాను. ఇఫ్ యూ డోంట్ మైండ్...అంటే నీవు సర్ది గలుగు తేనే...''

''అలాగే! దానికేముంది ?'' పరధ్యానంగా ఆ మాట లను అన్న పురుషోత్తం నాలుక కరుచుకొన్నాడు.

''ఇంకా ఏమిటోయ్ కబుర్లు ?''

''ఏమున్నయి బ్రదర్ ! వెదర్ చాలా బావుందిగదూ ?''

''ఓ చాలా బావుంది.''

''మరి, వస్తాను...అన్నట్లు పదిరూపాయిలు కావాలన్నావు గదూ...ఇదుగో.''

''తొందరేం ? కొంచెంసేపు కూర్చో. వెళ్ళొచ్చు.''

''వస్తానోయ్ పనుంది''.

''అంత అవసరం అయితే వుంచుకో ఎలాగో సర్దుకుంటా నులే''

''అబ్బె ఫరవాలేదు. మరి వస్తాను. బై బై''

''మళ్ళీ ఫస్టుకి యిచ్చేస్తానులే'' అన్న స్నేహితుని మాట లను వినిపించుకోకుండా బైటకు నడిచాడు పురుషోత్తం!

---

# ప్రణయ జీవులు

కళారాధకులకు కంటకాకీర్ణమార్గం కూడా పూలబాటవలె అగుపిస్తుంది. ఇది మన ప్రవచనం. ఈ కథ దీనినుండి ఒక నిర్ణయాన్ని యెత్తి చూపిస్తూ ప్రవచనం మాత్రం సరైనది కాదని రుజువుచేస్తుంది. తర్కశాస్త్రంలో అధునాతనమైన యీ పద్ధతి కథా రచనలో పైనా గోడకన్నా పురాతనమైన ఒక అద్భుతకళా విన్యాసము.

మధుసూదనుకు చిత్రలేఖనంలో ఒక విశిష్టమైన అభిరుచి వుండటమేగాక ఒక నిర్దుష్టమైన ప్రతిభా సంపత్తికూడావున్నది. చెన్నపురి లలితకళల కళాశాలలో శిక్షణపొంది తన పాట వానికి పదును పెట్టుకొన్నాడు. అతడు ఐదేండ్ల క్రిందట ప్రాయములో చిత్రించిన "సముద్రంలో తెరచాప" చిత్రపటం నేటి కిని ఆంధ్రమహాసభ భవనంలో వ్రేలాడుతూనే వున్నది. తన యిరవైయవయేట మద్రాసునుండి మకాం యెత్తేసి హైద్రాబాదు చేరుకున్నాడు మధుసూదన్.

ప్రసన్నకుమారి వీణ వాయిస్తుంటే కోకిల కలకూజితాలు వినిపించేవి. కంఠ మెత్తితే సెలయేటి గలగలలు, తేనె సోనల తీయదనాలు, మావిచివురుల మార్దవాలు అన్నీ ప్రతిధ్వనించేవి.

హైద్రాబాదు నగరంలో కళాకారుల సమ్మేళనం జరిగింది. ఆ సమ్మేళనానికి ఆంధ్రదేశంనుండి అనేక కళాకారులు హాజ

రయినాను. కళలకు సంబంధించిన అన్నివిషయాలు అందులో సమగ్రంగా చర్చింపబడినవి. ఆ చర్చలో పాల్గొనిన వారందరిలో అందరి దృష్టిని ఆకర్షించి అందరి ఆదరాభిమానాలను చూరగొన్నది ప్రసన్న, మధుసూదనుని చెప్పక తప్పదు. వారి ప్రథమ పరిచయం యీ విధంగా జరిగింది.

ఒకరి నొకరు చూసుకున్నారు. ప్రసన్న వీక్షణాలు మధుసూదనుని యెదలో మధుగీతలను పలికించాయి. ఆమె వాలు చూపులు అతనికి వలపు పిలుపులవలె అగుపించినవి. త్వరలోనే వారిద్దరూ కలసి వివాహం చేసుకొన్నారు. కళారాధకులకు కంటకాకీర్ణమార్గం కూడా పూలబాటవలె అగుపిస్తుందిగదా! ఇప్పుడు ప్రసన్న మధుసూదనుని అర్ధాంగ లక్ష్మి. అతడు తన హృదయపీఠంమీద నిలుపుకొని కొలచుకునే ఆరాధ్య దేవత!

ఆ నూత్న దంపతులజంట ఒక యింటిలాటి దానిని బాడుగకు పుచ్చుకున్నారు. "ఇల్లు ఇరకాటం..." అనే పెద్దల నానుడిలో గల సౌఖ్యాన్ని ప్రత్యక్షంగా చవిచూడ సాగారు. తను ప్రేమించిన అర్ధాంగలక్ష్మి, ఆరాధించే కళాలక్ష్మి రెంటితో కలసి ఒక ఇంటిలో హాయిగా కాపురం చేయదలచుకొన్న ధనికులైన యువకులకు నేను యిచ్చే మొదటి సలహా ఏమంటే వున్నదంతా అమ్ముకొని బీదవారికి దానం చేసేయమని.

చిన్న యిండ్లలో నివసించేవారు ఆనందమనేది అర్ణవమైతే దాని లోతులు యెప్పుడో చూశామని చెబుతారు. అందులో అవకతవకలు అగుపించకపోవు కాని, ఆ అవకతవకలలోనే ఆహ్లాదం వున్నది అంటారు వారు.

ప్రసన్న ఒకఉపాధ్యాయురాలిచెంత యింకా వీణ వాయించటం నేర్చుకుంటూనే వున్నది. మధుసూదన్ కూడా వేరొక ఉపాధ్యాయునివద్ద చిత్రలేఖనం అభ్యసిస్తూనే వున్నాడు. వారి గురువులు చెప్పేపాఠాలు యెంతతేలికగా వుంటాయో వారి శుల్కాలు అంత బరువుగా వుండేవి.

చేతిలో పైసలు గలగల లాడుతున్నంతవరకు ఆ దంపతులు అనుభవించిన ఆనందానికి అవధి లేదనేఅనాలి. వారి ఆశయాలు అతి నిర్దిష్టమూ, నిస్పష్టమూ అయినవి. కొద్దికాలం గడుస్తే చాలు మధుసూదనుని స్టూడియోకు చిత్రపటాలు కొనేందుకు ఒకరితో ఒకరు పోటీబడి నవాబులు, జమీందారులు, సర్దార్జీలు యెగబడుతారనే గట్టి నమ్మకం అతని కున్నది. ప్రసన్న కుమారి పాటకచ్చేరీలుచేస్తే వైజయంతీమాల నాట్యప్రదర్శనానికి వచ్చే డబ్బుకన్నా యెక్కువే వస్తుందని ఆవిడ దృఢమైన విశ్వాసము. కాని, ప్రసన్న అంతపని చేయవలసిన అవసరం వుండబోదని ఆ యిరువురకు కలసి యేర్పడిన అచంచలమైన ఆత్మ విశ్వాసము.

కాని, నా అభిప్రాయం ప్రకారం అన్నిటికన్నా మిన్న అయినది ఒక చిన్న యింటిలో కుర్చీలముందు కూర్చొని బాతాఖానీకొట్టుకోవటం అని. ప్రణయకోపాలు, పరిహాసాలు, పరితాపాలు, పరస్పర సానుభూతులు, భావిభాగ్యోదయాన్ని గురించిన చర్చలు... యువతీ యువకులకు లభించబోయే యీ యనుభూతులలోని యానందము అనుభవైక వేద్యమేగాని వర్ణనలకు అందనిది.

మన కళాకారులకు గల కళ సన్నగిల సాగింది. ఇంటిలో తండులాలు నిండుకొన్నాయి. ఇక గురుదక్షిణల నిచ్చి చదువు కొనేందుకు అవకాశం ఎక్కడ? కాని, కళారాధకులకు కంటకాకీర్ణమార్గం కూడ పూలబాటకదా? ప్రసన్న విద్యార్థినులకు చదువుచెప్పి డబ్బు సంపాదిస్తానన్నది. ఎలాగూ తన సంగీతపు పాఠాలకు స్వస్తి చెప్పక తప్పలేదనుకోండి.

విద్యార్థినుల కొరకు రెండుమూడు దినాలు వేటాడింది. ఒక సాయంకాలం యెంతో ఉత్సాహంతో యింటికి వచ్చింది ప్రసన్న. ఆమె నయనాలలో విజయరేఖలు ద్యోతకమవుతున్నాయి.

"మధూ! నాకొక శిష్యురాలు దొరికింది. ఆహా! ఎంత మంచిపిల్లఅనుకున్నావు. గద్వాలజమీందార్ గారి అమ్మాయి. వారి బంగళా బగ్గత్ పురాలో వున్నది. అటువంటి దివ్యమైన భవనం నే నెక్కడా చూడలేదనుకో. ఆ సింహద్వారాన్ని చూచితీరాలి. అదేదో చెక్క. మంచిగంధపుచెక్క అనుకొంటాను. ఇంక లోపల! మధూ! నిజంగా యెంతవైభవంగా వుంటుందో చెప్పటానికి నావల్లకాదనుకో."

మధు ఆశ్చర్యంతో ఆమె వైపు తేరిచూస్తున్నాడు. ప్రసన్న తిరిగి ప్రారంభించింది.

"నా శిష్యురాలి పేరు సుశీల. నిజంగా ఆ అమ్మాయంటే నాకు అప్పుడే యెంతో ప్రేమ యేర్పడిందనుకో. ఎంత సున్నితమైన శరీరం అనుకొన్నావు. పసిడి శలాకలాగ తళతళ మెరుస్తుంటుంది. ఎప్పుడు చూచినా కండ్లు చెదరిపోయేలా మల్లెపూలలాంటి తెల్లటిబట్టలు కట్టుకొనివుంటుంది. ఆ అమ్మా

యికి యెంత వినయవిధేయతలు ! బహుశా పదహారు పదిహే డేండ్లు వుంటాయి. అంతే. నేను వారానికి మూడు పాఠాలు మాత్రమే చెప్పాలి ? పాఠానికి పదిరూపాయలు యిస్తారు. ఇందులో దిగులుబడవలసింది యేమీ లేదు. ఇంకొక యిద్దరో, ముగ్గురో విద్యార్థినులు దొరుకుతే తిరిగి నా పాఠాలను నేను మొదలు పెట్టుకోవచ్చు. చా ! అదేంటి మధూ ! ఆ నొసలు ముడుచుకోవటం యేమిటి ? లే, హాయిగాపోయి భోంచేద్దాము."

"నీవు చెప్పినదంతా బాగానేవున్నది. అయితే, నా సంగ తేమిటి చెప్పు. ఆడదానివి వీధిలోనికిపోయి ఆర్జిస్తుంటే నన్ను గోళ్లు గిల్లుకుంటూ యింట్లో కూర్చోమంటావా ? నేను కూడా నా చిత్రపటాలను అమ్మి పాతికో పరకో ఆర్జించగలనను కొంటా" అన్నాడు మధుసూదన్ ఒకవిధమైన వేదనతో.

ప్రసన్న మధుసూదనుని దగ్గరకు తీసికొని అప్యాయంగా కంఠాన్ని కౌగలించుకొని, అతని నొక్కుల జుత్తులోనికి తన వేళ్లను పోనిస్తూ అతని కన్నులలోకి చూస్తూ ప్రేమ వెన్నెల జల్లులు కురిసేలాగా అన్నది :

"మధూ ! నీవు ఒట్టి వెర్రిబాగులవాడివి. నీవు నీ పాఠా లను వదిలిపెట్టటం యేమీ బాగాలేదు. నా సంగతంటావా అది వేరు. ఎందుకంటే నేను నేర్పుతూనే నేర్చుకుంటాను. ఇరువై నాలుగు గంటలు సంగీతపు సాన్నిధ్యంలోనే వుంటుం టాను. వారానికీ ముప్పై రూపాయలతో నైజాం నవాబు కన్నా ఖుషీయిగా నివసించవచ్చు. ఏమంటావు పిచ్చిబాబూ !"

ప్రసన్న మాటలు మధుసూదనుని ఎంతో కదిలించి వేసి నవి.

"నీవు యెన్నయినా చెప్పు. పాఠాలు చెప్పటం నాకు సుతరామూ యిష్టంలేదు. అది కళా గాదు పాడూకాదు. అయితే నేం? నీకు బాగా యిష్టమైపోయింది కదా?"

"కళారాధకులకు కంటకాకీర్ణమార్గం కూడా పూలబాట లాటిది."

"నీవు పబ్లిక్ గార్డెన్సులో కూర్చొని చిత్రించిన నీలాకాశపు చిత్రపటాన్ని చూచి మా గురువుగారు యెంత మెచ్చుకొన్నారో? నేను చిత్రించిన రెండుపటాలు అసెంబ్లీ భవనం ముందు వ్రేలాడదీయటానికి సెక్రటరీ అనుమతి యిచ్చాడు. చిత్రపటాల పిచ్చవున్న యే డబ్బుల పిట్ట అయినా దొరుకుతే అందులో ఒకదానిని అమ్మివేస్తా వనుకొంటాను."

"వో తప్పకుండా అమ్ముకోవచ్చు. గద్వాల జమిందారు గారు యెంత మంచివారనుకొన్నావు."

మరుసటివారం అంతా భార్యా భర్త లిద్దరు ఎనిమిది కాక ముందే భోజనాలను ముగించేసుకొని, యెవరి ద్రోవన వారు పోయేవారు. మధుసూదనుని మనస్సంతా పబ్లిక్ గార్డెన్సులో కూర్చొని అతడు చిత్రింపబోయేచిత్రపటాల మీదనేవుండేది. అతడు యింటినుండి బైటికివెళ్లేముందు ప్రసన్న అతని మోము నిండా ముద్దులవర్షాన్ని కురిపించేది. కళ అనేది క్షణమైన తీరిక యివ్వక వెన్నాడే భార్యలాంటిది. అతడు యింటికి తిరిగి వచ్చే టప్పటికి ఒక్కొకరోజు రాత్రి యేడుగంటలు కూడా అవుతుండేది.

వారము అయిపోవటంతో ప్రసన్న సంతోషంతో గెంతులు వేస్తూ చేతిలోని మూడు పదిరూపాయల నోట్లను తీసి బల్ల మీద విసిరేసింది.

ఒక విధమైన అలసటతో చెప్పక పోసాగింది :

"సుశీల మంచిదేగాని అప్పుడప్పుడు బాగావిసిగిస్తుంటుంది. అభ్యాసానికి, ఆ అమ్మాయికీ చాలాదూరం. అందుకనే పాచి పండ్ల దాసరిలా అయింది నా పని. అదీగాక యెప్పుడు చూచినా తెల్లటిబట్టలే. చెడ్డవిసుగేసిందనుకో. కాని గద్వాల జమీందారుగారు కరుణార్ద్ర హృదయులైన వయోవృద్ధులు. మధూ! నీవు ఒకసారి ఆయనతో పరిచయం చేసికొంటే బావుంటుం దనుకొంటాను. నేను సుశీలకు వీణ చెబుతుంటే అప్పుడప్పుడు వచ్చి గుమ్మముదగ్గర నిలుచునేవాడు–ఆయన భార్య స్వర్గస్థురాలయి చాలా రోజులైందట.

"ఏమమ్మా శ్రుతులు, లయలు అవేవో...అన్నీ అమ్మాయికి అలవడుతున్నాయా?" అని అప్పుడప్పుడు అడుగుతుండే వాడు.

మధుసూదన్ ముఖంలో యేమీ మార్పు అగుపించలేదు. ప్రసన్న చెప్పక పోసాగింది.

"నీవు ఆ యింట్లో వున్న సోఫాలసెట్లు, గోడలకు తగిలించిన చిత్రపటాలు చూచితీరాలనుకో. సుశీలకు అప్పుడప్పుడు దగ్గు తెరలు వస్తుంటాయి. అదంతా ఒక తమాషాలే. బైటకి కనుపించే దానికన్నా ఆ అమ్మాయి చాలా బలమైన దనుకొంటాను. నిజంగా మేము యిద్దరము రోజురోజుకుసన్నిహితుల మయిపోతున్నాము. ఆ అమ్మాయి సంస్కార సాంప్రదాయాలు కూలంకషంగావున్న ఉన్నతవంశంలో పెంచబడింది. గద్వాల జమీందారుగారి తమ్ముడు బ్రిటిషువారి హయాములో మంత్రిగా వుండేవాడట."

మధుసూదనుడు యేమీ మాట్లాడలేదు. మెల్లగా జేబు నుండి ఒక వంద, రెండు పది, ఒక ఐదు రూపాయల నోట్లను తీసి బల్లమీద పెట్టాడు.

"ఆ వాటర్ కలర్ చిత్రాన్ని బొంబాయినుండి వచ్చిన ఒక వర్తకునకు అమ్మాను ప్రసూ."

"నాతో వేళాకోళం ఆడవద్దు—నిజంగా బొంబాయినుండా? కాదుగదూ!"

"నిజమే. బొంబాయినుండే. నీవు చూస్తే బావుండే దను కుంటాను అతనిని. చాలావింతయిన వ్యక్తిలే. చాలా లావుగా వుంటాడు. ఎప్పుడు చూచినా నోట్లో చుట్ట, మెడకు వులెన్ మఫ్లర్. అసెంబ్లీ భవనం ముందు వ్రేలాడుతున్న చిత్రాల్ని చూచి మొదట దానిని ఒక గాలియంత్రం అని అనుకొన్నా డుట. ఆయన ఆశ్చర్యానందాలకు అంతులేదు. అది కొని యుంకొక నెమలి పటానికి ఆర్డరుకూడా యిచ్చాడు. 'ఆ మయూరం పింఛంవిప్పి నాట్యంసలుపుతే తాండవకృష్ణుడు జ్ఞప్తికి రావాలిసుమండీ, అన్నాడు అతడు నవ్వుతూ. ఆ పటాన్ని అతడు తనతోపాటు పట్టుకెళుతాడుట. సంగీతపుపాఠాలు వో! ఇంకావానిలో కళ యిమిడివున్నదనుకొంటాను."

"చాలా సంతోషంగావుంది మధూ! నేను అనుకుంటూనే వున్నాను. నీకు తప్పక జయం లభిస్తుంది. నూట యేభై ఐదు రూపాయలు! మన దగ్గర యింతకు ముందెప్పుడూ యింత డబ్బు లేదుకదూ ఖర్చు పెట్టుకోటానికి.

"ఇవాళ గారెలు, లడ్లు, పులిహోర చెయ్యి. మరచిపోయాను బొబట్లు" అన్నాడు నవ్వుతూ మధుసూదన్.

మరుసటి శనివారం సాయంకాలం మధుసూదన్ ముందుగా యింటికి వచ్చాడు. అతడు తన సూటయిర్నాడే ఐదురూపా యలు తీసి బల్లమీద పరిచాడు. చేతులనిండా నల్లగావున్న పెయింటు లాటి దానిని శుభ్రంగా కడిగేసుకొన్నాడు.

తరువాత కొంతసేపటికి ప్రసన్న ప్రత్యక్షమైంది. ఆవిడ కుడిచేతికి గాజుగుడ్డ దూదితో కట్టినట్లు కనిపిస్తున్నవి.

పరిహాస పూర్వక ప్రణయ పరామర్శలు జరిగిన తరువాత ప్రసన్న కట్లనైపుచూస్తూ.

"అరే యిదేమిటి ప్రసూ!" అంటూ ఆందోళనతో ప్రశ్నించాడు మధుసూదన్.

ప్రసన్న బిగ్గరగా నవ్వింది. కాని, ఆ నవ్వులో యేమా త్రమూ ఆనందము అగుపించలేదు.

"ఇవాళ సాయంకాలం సుశీల వాళ్ళయింట్లో భోజనంచేసి పోతేగాని వీలులేదని పట్టుపట్టి కూర్చొన్నది. సుశీల దంతా ఒకరకం పిచ్చి. వడ్డనంతా తన స్వంతంగా చేతిమీద చేయా లని పట్టుబట్టింది— ఇక జమీందారుగారు సరేసరి. ఒకటే కంగారు. వంటయింటికి ఒకటే పరుగు నౌకర్లు లేనట్లుగా. నాకు తెలుసు సుశీలకు అసలు వంట్లోబాగులేదని. ఆ అమ్మా యికి ఒకటే దడ. వణుకుతూనే వడ్డన ఆరంభించింది. సలసల కాగుతున్న పులుసు గిన్నెను గిన్నెపళంగా నా చేతిమీద కుమ్మరించేసింది. చాలాబాధ కలిగింది. మధూ! పాపం ఆ పిచ్చిపిల్ల యెంతబాధ పడిందో? సరే ఇక జమీందారుగారి కంగారు చెప్పనే పనిలేదు. గబగబ మెట్లుదిగుతూ క్రిందకు పరుగెత్తి యెవరినో—క్రింద కొలిమిదగ్గర పనిచేసే మనిషిట—

అతనిని పంపి మందుల షాపునుండి నూనె, దూది, గాజుగుడ్డ అన్నీ తెప్పించారు. ఇప్పుడంత బాధ లేదులే."

ప్రసన్న చేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు మధుసూదన్.

"అయితే, నీవు ఆ రెండవ పటాన్నికూడా అమ్మేశావా?" అని అడిగింది ప్రశ్నార్థకంగా బల్లమీద నోట్లనుచూస్తూ.

"అమ్మివేశానా? ఆ బొంబాయి వర్తకునే అడుగు. ఆ రెండు పటాలు తీసేసుకొని యింకొక పటంకూడా కావాలని అడిగాడు. అయితే, నీకు చెయికాలింది యివాళ మధ్యాహ్నం ఎన్ని గంటలకు."

"ఐదు అయివుంటుందనుకొంటాను. ఆ ఇనుప...అదే ఆ గిన్నె లేదూ...? నీవు గనుక ఆ సమయంలో జమీందారు గారిని చూసివుంటేనా?"

"ఇలా కూర్చో ఒక క్షణం" ప్రసన్నను తన దగ్గరగా తీసికొన్నాడు మధుసూదన్.

"అయితే, నిజం చెప్పు. ప్రసూ! క్రిందటి రెండువారాల నుండి యేమిటా చేస్తున్నావు నీవు?"

కొన్నిక్షణాలపాటు ప్రసన్న మౌనముద్రదాల్చింది. ఆవిడ కండ్లలో అనిర్వచనీయమైన ప్రేమ, స్థిరనిశ్చయము తొణికిస లాడుతున్నాయి. మధ్య మధ్య గద్వాల జమీందారుగారి పేరు వుచ్చరిస్తూ యేదో చెప్పటానికి వుపక్రమించి చివరకు కనుదోయినుండి అశ్రువులు ముత్తెపు బిందువులులాగా జారు తుండగా అన్నది—

"మధూ! నాకు విద్యార్థులు యెవ్వరు దొరకలేదు. నీవు నీ పాఠాలను వదలివేయుటం నాకు యే మాత్రమూ యిష్టం

లేదు. నాకు ఆ బిడ్సులో ఘోషన్సు లాండ్రిలో బట్టలు యిస్త్రీ చేసే వుద్యోగము లభించింది. జమీందారు, సుశీల. నేను సృష్టించిన కథ బాగావున్నదికదూ ? ఇవాళ లాండ్రిలో ఇంకొక అమ్మాయి బాగా మండుతున్న నిప్పులతో, వున్న ఇనుప పెట్టెను పొరబాటున నాచేతిమీద పెట్టేసింది. వచ్చే దోవలో యీ భోజనం, యీ పులుసుగిన్నె యివన్నీ సృష్టించుకొంటూ వచ్చాను. నీకు కోపంవచ్చిందా మధూ లేదుకదూ? నాకు ఆ పని దొరకకపోతే నీవా చిత్రాలను బొంబాయి వర్తకునకు అమ్మేవుండేవాడివి కాదేమో."

"అతడు వచ్చింది బొంబాయినుండి కాదు."

"ఎక్కడినుండి వస్తేనేం ? అది అంత ప్రధానంకాదు. నీవు యెంత తెలివిగాలవాడవు మధూ ఏదీ ముద్దియి...ఊఁ.. అయినా నేను సుశీలకు—సంగీతపు పాఠాలను చెప్పటం లేదని నీవు యెలా గ్రహించగలిగావు ?"

"ఇవాళ రాత్రివరకు నాకాసంగతి తట్టలేదు. నేను ఇంజను గదినుండి పై అంతస్థులో ఇస్త్రీచేస్తుండగా ప్రమాదం జరిగిన ఒక అమ్మాయికోసం యీ నూనెను, దూదిని యివాళ సాయంకాలం ఐదు గంటలకు పంపించాను. నేను క్రిందటి రెండు వారాలనుండి ఆ లాండ్రీలోనే ఇంజనుకు నిప్పువేస్తున్నాను."

"అయితే నీవు ఆ పటాలను..."

"నా బొంబాయి వర్తకుడు, నీ గద్వాల జమీందారు ఇద్దరు ఒకేవేళ యొక్క సృజనాత్మకాలే—కాని నీవు దానిని చిత్రలేఖనం అని గాని, సంగీతం అనిగాని మాత్రం పిలువజాలవు."

వారిద్దరూ తనివి దీరా నవ్వుకోసాగారు.

"కళారాధకులకు..."

"కాదు. ప్రణయజీవులకు కంటకాకీర్ణ మార్గముకూడా పూలబాటవలె అగుపిస్తుంది" అని పూర్తిచేసింది ప్రసన్న కుమారి.

ఆధారం: ఓ. హెన్రీ

---

# విధివిలాసం

అసెంబ్లీ భవనానికి యెదురుగావున్న టవర్ క్లాక్ పన్నెండు గంటలు కొట్టింది. ఆకాశంలో హుషారుగా పచార్లు కొడుతున్న భాస్కరుని వేడికిరణాలు పడి వీధిలో నడుస్తున్న నవయౌవనాంగుల లేత బుగ్గలను ముద్దెట్టుకొంటున్నాయి. పట్టపగటి భానుడు బహిరంగంగా చేస్తున్న చిలిపిచేష్టలకు కోమలాంగుల చెక్కిళ్లు సిగ్గుతో యెరుపెక్కి పోతున్నవి.

తాత్కాలికాశ్రయం యిచ్చిన గుంటూరు మీద మమకారాన్ని వదులుకోలేని హైకోర్టు హైదరాబాద్‌కు వస్తూ వస్తూ తనతోపాటు గుంటూరు ఎండలను వెంటబెట్టుకు వచ్చిందా అని అనిపిస్తోంది, అప్పుడప్పుడే ప్రవేశిస్తున్న వేసవి సాగిస్తూవున్న సంరంభాన్ని చూస్తూవుంటే.

తీవ్రమైన ఎంత వేడిమిని ఖాతరుచేయకుండా తన జీవితం మాదిరిగానే ఎగుడు దిగుడుగావున్న హైద్రాబాద్ రోడ్ల మీదుగా నడుస్తున్న కుటుంబరావు చెంపలమీదుగా కారుతున్న చెమట మూసీ పదివి తలపునకు తెలుస్తున్నది. కొం

చాల దూరంలో కనిపించిన కిల్లీకొట్టు చూసేసరికి కుటుంబ రావుకు పోతూ పోతూ వున్న ప్రాణం తిరిగి లేచివచ్చినట్ల యింది. ఆ షాపుముందు ఒక అందమైనబల్ల వ్రేలాడుతున్నది. ఆ బల్లమీద అందంగా తీర్చిదిద్దబడిన 'పటేల్ పాన్ షాప్' అనే అక్షరాలు ఎండలో తళ తళ మెరుస్తున్నవి. నాయకుల పేర్లను వాడేముందుగా ప్రతివారు ప్రభుత్వం అనుమతి తీసు కోవాలనే శాసనం ఇంకా ఎందుకు అమలులోకి రాలేదా అనే గట్టి సంశయం అనేకసార్లు అతని మనసులో ఉదయిం చింది. గాంధీక్షౌరశాల, సుబాష్ బూట్‌హౌస్, శివాజీగాజుల షాపు...మొదలైన పేర్లనుచూస్తున్నప్పుడు అతని హృదయం విచారంతో కృంగిపోతుంది.

"క్యా చాహియే ఆప్‌కో" అనే ఆప్యాయమైన కంఠధ్వని విని కుటుంబరావు తన ఆలోచనా ప్రపచంనుండి బైటపడ్డాడు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడా రాజధాని నగరంలో తెలుగుకన్నా ఉరుదూ యే ఎక్కువగా వాడకంలోవున్నదనేం దుకు ఏమీ సందేహంలేదు. హిందీ జాతీయభాష కాబట్టి ప్రతివారూ తప్పక నేర్చుకోవాలనే సిద్ధాంతాన్నే పలపరిచే వాళ్లలో కుటుంబరావు కూడా ఒకడు. అందుకనే అతడు హైదరాబాద్ వచ్చిన క్రొత్తలో ఉరుదూలో మాట్లాడుదా మనే ప్రయత్నాలు కూడా చేశాడు. అది అతడు హైదరా బాద్ వచ్చిన రెండవరోజు. ఆ బిష్నుదోడ్డులో రెండంతస్తుల బస్సు ఎక్కి కూర్చున్నాడు. కండక్టర్ తన దగ్గరకువచ్చి ఏదో ఉరుదూలో అడిగాడు. తనూ ధైర్యంచేసి ఉరుదూలోనే సమా ధానం ఇచ్చాడు. తన భాష బాగులేదో, ఉచ్చారణలో

లోపమో ఏమో బస్సులోని ప్రయాణీకులందరు ఫక్కుమని నవ్వారు. తన కెదురుగా కూర్చొన్న ఒక అందమైన అమ్మాయి కూడా ముసి ముసి నగవులు నవ్వటంతో కుటుంబరావు గుండెలు ఆగినంత పని అయింది.

ఈ సంఘటనలన్నీ గుర్తుకువచ్చిన కుటుంబరావు ఉరుదులో మాట్లాడే ప్రయత్నానికి స్వస్తి చెప్పాడు.

ఒక కార్కు సోడా, త్రాగి, పాన్ వేసికొని, ఎల్లోరా సిగరెట్టు ప్యాకెట్టుకొనుక్కొని తిరిగి తన నటరాజా సర్వీసుకు హుంకుం జారీచేశాడు. సిగరెట్టు ప్యాకెట్ విప్పటంతో ఒక కూపన్ కనిపించింది. "ఈ కూపన్ దాచండి—మీకు అదృష్టం ముంటే బహుమతి రావచ్చు" అనే అక్షరాలు ముద్రింపబడి వున్నవి దానిమీద. ఇదంతా వ్యాపార రహస్యం కాబోలు అనుకొన్నాడు కుటుంబరావు. ఎప్పుడో చెప్పులో దూరిన రాతిముక్క కాలితో కుస్తీపడుతున్నది. వేమన నిజంగా మహాకవుల కోవకు చెందినవాడు. చెప్పులోని రాయిని వదిలించుకొందామని కాలిని గట్టిగా విదిలించాడు. ఆ విసురుకు రాతిముక్కతో కలిసి కాలిచెప్పుకూడా నడిరోడ్డు మీదకు వచ్చి పడింది. అ ప్రయత్నంగా కుటుంబరావు దృష్టి పాదరక్షవైపు ప్రసరించింది. చెప్పు పాతదై చినిగిపోతూ అవసానదశకు చేరుకొన్నది. మానవుని జీవితం కాడా అంతేకదా అని అనుకుంటూ కుటుంబరావు నడుస్తున్నాడు.

కుటుంబరావు ఇంటికోసం అన్వేషణ ఆరంభించి సుమారు నెలకు పైగా అయివుంటుంది. పెద్దలకు, చిన్నలకు, అధికారులకు, అనధికారులకు, కంట్రాక్టర్లకు, యాక్టర్లకు

అందరికీ హిమాయత్ నగర్‌లోనే ఇల్లు కావాలని పట్టుదల. బస్సు జనంతో కిటకిట లాడుతుంటే ఒక పెద్దమనిషి ఫ్రంటు సీటుకోసం తగవులాడాడుట. అందుకనే హైద్రాబాద్ పేరు మార్చి హిమాయత్ నగర్ అని పేరు పెడితే ఈ సమస్య పరిష్కారం కావచ్చునని కొంతమంది సలహాకూడా ఇచ్చారు. కాని కుటుంబరావుకు మాత్రం అలాటి పట్టింపులు ఏమీలేవు. ఎక్కడోఅక్కడ తలదాచుకొనేందుకు ఇంతకొంపఅనేది దొరుకుతే చాలనే దృక్పథంతోనే గత నెలనుండి గడబిడలు పడుతున్నాడు అతగాడు.

ఆ ఇంటిముందు వచ్చేసరికి అతని కాళ్లు అప్రయత్నంగా ఆగిపోయాయి. ఈ ఇంట్లో ప్రయత్నిస్తే తప్పక పని అయితీరుతుందని ఏదో అంతర్వాణి అతనిని ప్రబోధించినట్లయింది. ధైర్యంచేసి తలుపు తోసుకొని లోపలకు ప్రవేశించాడు. లోపలనుండి నడిమి వయస్సులోవున్న నూరు నయాపైసల ఆంధ్రుని ఆకారం ఒకటి ప్రత్యక్షమైంది. ఆయన వస్తూ వస్తూ "కౌన్" అని ప్రశ్నించాడు. కుటుంబరావు ముఖం చూచి "ఎవరికోసం ?" అని తిరిగి ప్రశ్నించాడు.

"త...త...తమరి దర్శనం కోసమే వచ్చానండి"

"అరే, నిన్ను ఇంతకు ముందు ఎప్పుడూ చూచిన గుర్తు లేదే"

"నన్ను కుటుంబరావని పిలుస్తారండి. స్నేహితులు కుటుంబం అనికూడా పిలుస్తుంటారనుకోండి. "కురావు" అనేపేరుతో అడపా దడపా పత్రికలలో పడే కథలు కూడా నేను వ్రాస్తూవుండేవేనండి"

"ఓహో! అలాగా. ఇంతకూ తమరు ఏపనిమీద వచ్చారో సెలవియ్యలేదే ?"

"నేనా అండీ. ఏమీలేదు. తమ ఇంట్లో కాళీ ఏమన్నా వున్న దేమో కనుక్కుందామని. అంటే తమరు కొంచెం అద్దెకు ఇచ్చేభాగం యేదన్నా వున్న దేమోనని. అంతే."

"అంటే అద్దెకు ఇల్లు కావాలన్నమాట."

"అవునండీ."

"తమరి స్వస్థలం ఏది బాబూ !"

"మాది తూర్పు గోదావరిజిల్లా లెండి."

"అరే చెప్పావు కాదేం ? మన జిల్లావాడివే నన్నమాట. మరిచేపోయాను. నిలుచునే మాటాడుతున్నాము. లోపలకు వెళ్ళి కూర్చొందాము రా."

లోపల హాలులో చెరొక కుర్చీమీద కూర్చున్నారు. ఆ ఇంటి యజమాని పేరు సోమయాజులు. సోమయాజులుగారే బాతాఖానీకి నాందీ ప్రస్తావన గావించారు.

"మీరు కాఫీ తాగుతారా ? హైద్రాబాదు వచ్చిన తరువాత టీ అలవాటయిందా ?"

"అసలు మనకి ఏవీ పట్టింపులు లేవనుకోండి. ఏదైనా తాగేస్తాను సాధారణ పరిస్థితుల్లో. కాని, ఈ ఎండలో అవేమీ వద్దులెండి."

"పోనీ షరబత్ పుచ్చుకొందురుగానిలే" అంటూ సోమయాజులుగారు 'సుశీ' అని కేక వేశారు. అప్రయత్నంగా కుటుంబరావు కన్నుల దృష్టి హాలువైపు ప్రసరించింది. పదునయిదేండ్ల ఈడుగల బాలిక. అచ్చంగా పసిడి శలాక.

"అమ్మా కొంచెం షరబత్ తెచ్చిపెడుతావా?" అన్న సోమయాజులుగారి మాటలు విన్న సుశీ తిరిగి లోపలనుండి అంతర్ధానం అయిపోయింది. కుటుంబరావు కన్నులు మిరుమిట్లు గొలిపినట్లయింది. మెరిసిన మెరుపులా, పొడమిన ఇంద్ర ధనస్సులా ప్రత్యక్షమైన ఆ అమ్మాయి ఆకారం అతని హృద యంలో మధురానుభూతులను రగుల్కొల్పింది.

"చూశావు బాబూ! నాకు మన జిల్లావాళ్ళంటే మా చెడ్డ అభిమానం అనుకో. మనవాళ్ళకు వినయ విధేయతలకు, గుణ సంపదకు పెట్టింది పేరు. ఏమంటావు?"

" ఎంతమాట! అచ్చంగా అక్షర లక్షలు విలువచేసే మాటలు సెలవిచ్చారు."

"ఈ ఇంటిని చూశావు బాబూ! ఇది నా స్వార్జితంతో కట్టించాను."

"అలాగా అండీ."

"ఎంతో కాలేదనుకో. ఆ రోజుల్లో పాతిక వేలదాకా అయింది. ఇల్లు పూర్తయిందాకా కంటికి కునుకు పట్టలే దనుకో."

"మరి మాటలతో అయ్యే పనాండి. అందుకనే పెద్దలు ఇల్లుకట్టిచూడు అన్నారు."

"మా బాగా అన్నావు. అన్నట్లు మరచాను. నీకు పెండ్లి అయిందా బాబూ?"

"పెండ్లా? ఆఁ అయిందండీ."

సమయానికి అబద్ధం దానంతటే అదే దొర్లి వచ్చినందుకు తనను తానే అభినందించుకున్నాడు. అందుకనే పాత రోగి

సగం వైద్యుడు అన్నది అనుభవజ్ఞులు. ఈ చిన్న అబద్ధమే సమయానికి స్ఫురణకు రాక రెండు మూడు చోట్ల దొరక బోయే ఇల్లు సడన్‌గా వెనక్కుమళ్ళి వెళ్ళిపోయింది.

గాజులచప్పుడు కావటంతో కుటుంబరావు తలసడన్‌గా పైకి లేచింది. "ఓహో! ఎంత అందంగావుంది?" తను కవీ గాడు, చిత్రకారుడూకాడు ఆ అమ్మాయి అందానికి న్యాయం చేకూర్చటానికి. కాని, తను ఒక పురుషుడు. అందులో నూత్న యౌవనం తొంగిచూస్తున్న ప్రాయంలోని వాడు. మానవ సహజాలయిన సౌందర్యతృష్ణ, ఆనందారాధనా పిపాస ఆత నికీ వున్నవి.

నాలుగు కన్నులు కలుసుకొన్నప్పుడు అవి ఏ భాషలో మాట్లాడుకొన్నదీ చెప్పటం చాలా కష్టం. వాలు చూపుల లోని వలపు పిలుపులు ఎదలలో మధురపు తలపులను రేకెత్తిం చవచ్చు. అదొక రకపు అనుభూతి. ఆ అనుభూతిలో ఎంతో ఆనందం! ఎంతో పరవశత్వం!! అలాటి తాత్కాలికానందమే అనుభవించాడు కుటుంబరావు ఆ క్షణంలో.

"షరబత్ తీసుకోండి" అన్న సోమయాజులుగారి మాట లతో కుటుంబరావు తిరిగి భావనా వీధులనుండి సోమయాజులు గారి ఇంట్లోకి వచ్చిపడ్డాడు. తరువాత కుటుంబరావుకు సోమ యాజులుగారు ఇల్లంతా చూపించారు. కుటుంబరావుకు కావ లసిన భాగం కుదుర్చుకొన్నాడు. అద్దె విషయంలో ఎక్కువ తర్జన భర్జన లేమీ జరుగలేదు.

మరునాడే కుటుంబరావు సోమయాజులుగారి ఇంట్లో చేరాడు. గదిలో కూర్చొని సిగరెట్టుపొగలను వదులుతూ

తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అబద్ధమాడి ఇల్లు సంపాదించినందుకు అతనికి దిగులుపట్టుకొన్నది. అతనికి బెంగ అబద్ధం ఆడినందుకు కాదనుకోండి. లేని అర్ధాంగిని ఎలా సృష్టించటమా అని. ఇంటి చిక్కులు తీరిన కుటుంబరావును ఇల్లాలు చిక్కపట్టుకున్నది.

"ఏమి బాబూ! ఇల్లూ అదీ అంతా సౌకర్యంగా వుందా? ఏమీ మొహమాట పడకు. అందులో ఒక జిల్లావాళ్ళము" అంటూ సోమయాజులుగారు గదిలోకి ప్రవేశించాడు.

"అన్నీ చక్కగా ఉన్నయ్యండీ. ఏమన్నా కావాలంటే మిమ్ములను అడుగుతానుగా"

"అన్నట్లు మరచాను. అమ్మాయి వాళ్ళను ఎప్పుడు తీసుకవస్తావు?"

"మా వాళ్ళు పురిటికి వెళ్ళారండీ. తొమ్మిదవ నెలకూడా వచ్చిందనుకోండి."

"అలాగా ?

"అవునండీ. ఇక్కడ హోటలు భోజనం చెయ్యలేక చచ్చిపోతున్నానండీ. ఏభై రూపాయలు ఇచ్చి హోటలులో చేసే భోజనం కన్నా ఆవకాయ వేసికొని మనఇంట్లో తినే తిండే ఎంతో బావుంటుంది. ఏమంటారు?"

"మా బాగా అన్నావు. ఎంతయినా హోటలు భోజనం హోటలు భోజనమే. ఇంటి తిండి ఇంటి తిండే. వస్తాను. నీకు ఏమన్నా కావలసివస్తే అడుగుతూవుండు" అంటూ సోమయాజులుగారు బైటకునడిచి వెళ్లారు. గండగడిచి పిండబైటపడ్డట్లుగా కుటుంబరావు వేడి నిట్టూర్పు విడిచాడు.

క్కాలం గడిచిపోతున్నది, అసలు కాలం పగు గెడుతున్నదా లేదా అనే అనుమానం వేస్తున్నది అతనికి. అతని కన్నులు ఆ అమ్మాయికోసం ఆ ఇంటిని గాలించివేస్తుండేవి. ఎప్పు డన్నా హఠాత్తుగా కన్పించినా ఆ అమ్మాయి యిట్టే మెరుపులా మాయమయిపోతుండేది. కన్నులు మాత్రం కొంటె చూపులు చూస్తూండేవి. "ఆ అమ్మాయికి తనంటే యిష్టమేనా?" అంటే "ఆ అమ్మాయి తనను ప్రేమిస్తుందా" అని తన ఊహాకు తనేనవ్వుకొనేవాడు, ఆ కుటుంబం లేని కుటుంబరావు.

కుటుంబరావు పనిచేస్తున్న కంపెనీకి వరుసగా వారంరోజులు సెలవు వచ్చింది. తనకు మదరాసులోచాలమంది ప్రాణస్నేహితులు ఉన్నారు. ఎన్నాళ్లనుండో ఒకసారి మద్రాసు వెళ్లివద్దామని అనుకొంటూవున్నాడు. అనుకొన్న దేతడవుగా ఆ సాయంకాలమే మద్రాసుకు బయల్దేరాడు అతడు.

ఆ రోజు ఆగష్టు 15 స్వాతంత్ర్యదినోత్సవం యథాప్రకారంగా జరిగిపోతున్నది. ఊరేగింపు, ఉత్సవాలు ఉపన్యాసాలు, విన్యాసాలు అన్నీ ఉత్సాహంతో జరిగిపోతున్నవి. పగలంతా స్నేహితులతో కులసాగా గడిపాడు. సాయంకాలం ఆరుగంటలు కావటంతో అలా మెరీనా బీచ్‌వైపు బయల్దేరాడు. త్రోవలో కోయంబత్తూర్ అయ్యరు హోటలు అగుపించింది. అతని పాదాలు హోటలువైపు దారి తీసినవి. బాదంహల్వా, బీన్సు వడ తిని కాఫీ త్రాగి అయ్యరుగారికి బిల్లు చెల్లించుకొని బీచ్ వైపు నడిచాడు. ప్రెసిడెన్సీకాలేజి సమీపానికి వచ్చాడు. ఇంతలో మొబైలు పోస్టాఫీసు వాన్ 'బొంయ్' మని శబ్దం

చేసికొంటూ వచ్చి రోడు ప్రక్కగా ఆగిపోయింది. ఒక్కనిముషంలో వాన్ వెనుక పెద్ద 'క్యూ' ఏర్పడింది. ఎలెక్ట్రిక్ రైళ్లు, మొబైలు పోస్టాఫీసులు, మొబైలు హాస్పిటల్సు—నిజంగా కార్యశూరులయిన అరవవారిని చూస్తూంటే కుటుంబరావుకు ఒకవిధమైన ఈర్ష్య కలుగుతుండేది. ఉండి వుండి కుటుంబరావుకు ఒక బ్రహ్మాండమైన బ్రెయిన్ వేవ్ వచ్చింది. వెంటనే అతడు కూడా 'క్యూ' లో నిల్చున్నాడు. ఐదునయా పైసలు ఇచ్చి కార్డుకొని ఆకార్డుమీద గబ గబా ఇలా వ్రాశాడు.

మద్రాసు, ఆగస్టు 15

'శ్రీ సోమయాజులుగార్కి,

ఈ దినం సాయంకాల ఆరు గంటలకు ప్రసవము కష్టమై నాభార్య పిల్లతోసహా స్వర్గస్థురాలైనదని తెలుపుటకు ఎంతయు విచారించుచున్నాను.

విధేయుడు,

కుటుంబరావు.'

కార్డు పోస్టులోవేసి బీచ్ వైపెనకు నడిచాడు కుటుంబరావు.

ఉత్తరంచూచిన సోమయాజులుగారికి మతిపోయినట్లయింది. ఇంట్లో చేరి ఎక్కువ కాలం గాకపోయినప్పటికీ కుటుంబరావు సోమయాజులుగారి కుటుంబపు సానుభూతిని చూరగొనగలిగాడు. తమ ఇంట్లో చేరిన కొద్దికాలానికి అతనికి ఈ ఆపద రావటం చూచి తామే ఏదో నేరంచేసినట్లుగా బాధపడ్డారు ఆ భార్యాభర్తలు ! ఇలావుండగా భార్య సోమయాజులుగారి చెవిలో ఒక రహస్యం చెప్పింది. ఆయన ముఖం విప్పారిన

పుష్పంలా వికసించింది. అవును నిజమే. కుర్రాడు రూపసి. అష్టే వయసు లేదు. పిల్లాజెల్లా లేనప్పుడు రెండవపెండ్లి అయితే మాత్రం మునిగిపోయిం దేముంది ? నాలుగురాళ్లు తెచ్చు కొంటున్నాడు. తనకుమాత్రం వేరే ఎవరున్నారు? ఒక్కగాను ఒక్కకూతురు ! కంటిముందు మెదలుతూ వుంటారు కూతురు అల్లుడు చిలుకా గోరింకలలాగా.

కుటుంబరావు మద్రాసునుండి తిరిగివచ్చాడు. భార్యాభర్త లిరువురు అతనిని ఎంతో ఆప్యాయంగా పరామర్శించారు. అప్పటినుండి ఆతనిని హోటలుకు పోనివ్వలేదు వారు. ఎప్పుడు చూచినా ఆనందంతో కళకళలాడుతూ నవ్వులుచిందించే ఆతని వదనం పూర్తిగా విచారాభారంతో క్రుంగిపోయింది, అతడు ఆఫీసుకుకూడా సరిగా పోవటంలేదు.

ఒకరోజు సాయంకాలం సోమయాజులుగారు విషయాన్ని అతిలౌకికంగా కదిపాడు కుటుంబరావుముందు. "ఇదిగో చూడు బాబూ! నీవు అలా విచారంతో క్రుంగిపోవటం ఏమీ బాగా లేదు. కష్టా లనేవి మనుష్యులకుగాక మ్రానులకు వస్తాయయ్యా? నేనొక మాటచెబుతాను. వింటావూ ? పెద్దనాడినికదా ?"

ఏమిటో చెప్పండి అనే అర్థం వచ్చేటట్లు ప్రశ్నార్థకంగా కుటుంబరావు సోమయాజులుగారివైపు చూచాడు. "ఆ. ఏమీ లేదు. నీకుగనుక ఇష్టంఅయితే నిన్ను మా అల్లునిగా చేసు కొందామనివుంది. ఏమంటావు?" అతను ఏమి సమాధానం ఇస్తాడోననే ఆదుర్దాను వ్యక్తపరుస్తున్నయి, కుటుంబరావువైపు చూస్తున్న సోమయాజులుగారి కన్నులురెండు.

లోలోపల కుటుంబరావుకు కలిగిన ఆనందానికి అందు లేదు. అయినా పైకి తొణకకుండా "ఏమోనండీ. జీవితం తంతు చూస్తూంటే ఏదో విధమైన విరక్తి పుట్టుకొస్తున్నదండీ" అని అన్నాడు అతడు.

"అలా బేజారయిపోతే ఎలా ? ఒడిదుడుకులకు తట్టుకొని నిలువగలవారే నిజమైన సౌఖ్యాన్ని పొందగలుదుతారు" అని సమాధానం ఇచ్చాడు ఆయన.

చివరకు కుటుంబరావు తన అంగీకారాన్ని అందచేశాడు. ఆనందాన్ని పట్టలేక ఒక్క పరుగున వెళ్ళి సోమయాజులుగారు శుభవార్తను భార్య చెవిని పడవేశారు. తలుపుచాటున నిలిచి వింటున్న సుశీలలో వలపు తలపులు, నునుసిగ్గు దొంతరలు రేకెత్తినవి.

శుభముహూర్తం చూచి సుశీల, కుటుంబరావుల వివాహాన్ని జరిపించివేశారు. సోమయాజులుగారు. అది మొదటి రాత్రి. గది అంతా సుందరంగా అలంకరించబడింది. గోడమీద అందమైన చిత్రపటాలు వ్రేలాడుతున్నవి. బల్లమీద మధుర మైన భక్ష్యాలు ఎదురుచూస్తున్నవి. నలువైపుల కట్టబడిన పూల పరిమళాలు, ముట్టించబడిన అగరువత్తుల సువాసనలు గదినిండా అలముకొన్నాయి. కుటుంబరావు పందిరిపట్టె మంచంమీద పడుకొని పైకి చూస్తున్నాడు. సుశీల పిల్లిలాగా గదిలోకి అడుగెట్టింది. సుశీలరాకను అతడు గమనించినట్లు లేదు. ముందు సుశీలే నోరుజారింది.

"ఏమండీ."

"............."

"ఏమండీ. మాట్లాడరేం? అక్కను గురించి ఆలోచిస్తున్నారా ?" ప్రక్కన నిలిచివున్న సుశీల కన్నులలోని అమాయకత్వం చూచి అతనిహృదయం జాలితో నిండిపోయింది. మరుక్షణంలో సుశీల కుటుంబరావు బాహువులలో చిక్కిపోయింది. భార్యాభర్తలకు మొదటిసారిగా కలిసే ఆ అనుభూతిముందు ప్రపంచం అంతా క్షుద్రంగా అగుపిస్తుంది. 'ఒకరి కొకరు' అంతే! ఆ క్షణంలో ఎన్నో ఊహాలు, ఎన్నో కలలు, ఎన్నో ఆశలు, ఎన్నో ఆశయాలు వ్యక్తపరచుకొంటారు. ఒకరికొకరు. ఒకరి హృదయాన్ని విప్పి ఇంకొకరిముందు వుంచారు. అందులో అబద్ధాలకుగాని, రహస్యాలకుగాని తావుండదు. జరిగిన కథను చిలిపినవ్వులతో, తీయని ముద్దులతో, చిలువలు, పలవలు చెక్కుతూ కుటుంబరావు సుశీలచెవిలో వూదాడు. సుశీలకు కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు.

"అమ్మ దొంగా! ఇంటికోసం లేని ఇల్లాలును సృష్టించి ఇంత నాటకం ఆడారా? రేపు ప్రొద్దున్న మా నాన్నగారితో చెప్పి అబ్బాయిగారికి..."

"చెప్పుకో నా కేం భయం?" అన్నాడు.

"ఏమిటండీ మరీ పిల్లలలాగా" అంటూ కొంటెచూపులు చూచింది సుశీల అతనివైపు.

"మనకు పిల్లలు పుట్టిందాకా మనము పిల్లలమేగా!" అలాగే వేళాకోళాలతో, ఆనాందానుభూతులతో ఆ రాత్రి గడిచిపోయింది. ఆ నవదంపతులకు. అప్పటినుండి వారు ఆనం

(6)

దార్ణవపు లోతులు, అనురాగాంబరపుటంచులు చూస్తున్నారు, ప్రతిదినము.

ఒకరోజు సుశీలకు డోకులు ఆరంభమైనవి వుండీవుండి. సుశీల గారాల ముద్దుపట్టి తల్లిదండ్రులకు. తొలి చూలు. తల్లికి కూతురు రుచులు, అభిరుచులు అన్నీ తెలుసు. ఆ అమ్మాయికి కావలసినవి అన్నీ నోరు తెరచి అడిగే అవసరం లేకుండా చేకూరుస్తున్నారు. ఇంటిలోని దంపతుల జంటకు కలిగిన ఆనందానికి అవధులే లేవు.

సుశీలకు తొమ్మిదవ నెల వచ్చింది. ఒకరోజున నొప్పులు ఆరంభమైనవి. ఒక లేడీడాక్టరు, నరుసు ఇరవైనాలుగు గంటలు సోమయాజులుగారింట్లోనే వున్నారు. కుటుంబరావు గదిబైట కాలికాలిన పిల్లిలాగా పచార్లు చేస్తున్నాడు.

హఠాత్తుగా కుటుంబరావు చెవులకు "స్వతంత్ర భారత్ కు జై" అనే నినాదం వినిపించింది ఎక్కడనుండో. అతని కన్నులు గోడమీదవున్న క్యాలెండరువైపు చూచినవి. ఆరోజుఆగస్టు 15. సరిగా సంవత్సరంక్రితం అతను మద్రాసులో ఉన్నాడు. జరిగిన కథఅంతా అతని మెదడులో ఫిలుము రీలులాగా తిరిగిపోయింది. ఇంతలో గదిలోపల గొల్లుమని రోదనధ్వనులు చెలరేగినవి. బైటకువస్తున్న నరుసు "వెరీ సారీ సర్. ప్రసవం చాలా కష్టక అయింది. మా ప్రయత్నాలు ఫలించలేదు. తల్లీపిల్లా ఇద్దరు మనలను వదిలిపెట్టి వెళ్ళిపోయారు" అంటూ వెళ్ళిపోయింది.

"అంతా ఘటన!" అంటూ అంతులేని ఆవేదనతో కుర్చీలో కూలబడ్డాడు కుటుంబరావు.

---

# వరుడు కావలెను

"ఒరేయ్ కవీ!"

"ఏరా రవీ?"

"ఎంతవరకొచ్చిందో నీ డ్రాఫ్టు?"

''అయిపోయింది బ్రదర్. ఫైనల్ టచస్ యిస్తున్నాను"

"ఏదీ యిలా పడెయ్ చూద్దాం."

వరుడు కావలెను

సాటిలేని సౌందర్యవతి. పిల్లలులేని వితంతువు. తిరిగి వివాహాము చేసికొనగోరుచున్నది. వయస్సు ముప్పది. ముప్పదివేల నగదు, ముప్పది ఎకరాల ఫల్లపుభూమికి అధికారిణి. ధనికునికన్నా పేదవాడయితే మరీమంచిది. నిరుపేదలు నిండు నవనీతమనస్కులని ఆమె అభిప్రాయం. విశ్వాసపాత్రుడూ ఆస్థిని సక్రమమైనపద్ధతిలో సరిదిద్దగలవాడు ఆదాయాన్ని సద్వినియోగం చేయగలిగినవాడు అయితే, వయసుమళ్లినవాడుకాని, ఇంటిపట్టున వుండటానికి అలవాటు పడినవాడు కాని అయినా అభ్యంతరంలేదు. వెంటనే వివరాలతో వ్రాయండి.

ఏకాంతవాసిని,

సి ఓ కవి అండ్ రవి కంపెనీ లిమిటెడ్.,

పరిణయ ప్రతినిధుల సంస్థ

హైద్రాబాద్—3

"బ్రహ్మాండంగా కుదిరింది బ్రదర్. అంతాబాగానేవున్నది కాని యింతకూ యేదో మినహా కన్యాదానం అన్నట్లు వితం

తువు యేంటి?" కవి కన్నులలో విస్పష్టమైన విసుగు కనుపించింది.

"పెండ్లి ప్రకటనకు వితంతువు వుండటానికి యేమిటో సంబంధం? మరి నాకుమాత్రం అర్థంకావటం లేదు."

"కవీ! నీవు అక్కడే పప్పులో కాలేస్తున్నావు. దొంగతనం చేస్తే చిక్కకుండా వుండేటట్లు చెయ్యాలి. అందులోనే వుంది గొప్ప. చట్టవిరుద్ధమైన పనుల్లో మన వస్తువు బహిరంగంగా వుండాలి. పోలీసులకు చిక్కకుండావుండాలంటే ముందు మనకు వితంతువు దొరకాలి. తరువాత కథఅంతా చాలా సులభం. ఏమంటావు బ్రదర్."

"నిజమే రవీ! నీవు చెప్పింది. పోస్టాఫీసువాళ్లు, పోలీసుల జీతాలు తింటూ వూరకకూర్చుంటారా? అయితే ఇంతకూ నేతిబీరకాయలాగా యీ వివాహం లేని వివాహం ఫథకంలో వేలు పెట్టడానికి అంగీకరించే వెర్రి వెధవావిడ ఎక్కడ దొరుకుతుందయ్యా మహానుభావా!"

"రవి కాంచనిచో కవి కాంచును అని అన్నారుకదా? మరి యిదెక్కడి కవివయ్యా నీవు. కొంచెం బుర్రకు పదునుపెట్టు."

"అబ్బే మనంఅంతా యిందకాలం కవులం బ్రదర్. రవి కిరణాలే ప్రసరించాలి నలుదిక్కులకు. ప్రసరించి గాలించి పెకలించి వెలికి తియ్యాలి ఒక వితంతురత్నాన్ని."

"అన్నట్లు మరిచిపోయాను. మన స్నేహితుడు ఒకాయన వుండేవాడు. ఆయన పేరు విశ్వనాథం!"

"విశ్వనాథమో జగన్నాథమో...అనాథలు కావాలయ్యా అంటే యీనాథాలు సంగతి ఎందుకు బ్రదర్ టైం వేస్టు!"

''కొంచెం గుర్రాన్ని కట్టెయ్ కవికుమార్! చెప్పేది పూర్తిగా వినవయ్యా బాబూ! ఆ విశ్వనాథం యిటీవలనే కాశీ విశ్వనాథుని చేరాడులే. అదీ అసలుకథ!''

''అంటే సతీమణిని వితంతువును చేసి మరీ వెళ్లిపోయాడు. అంతేనా?''

''సరీగా సెంటుపర్సంటు అంతే! ఆవిడ పేరు భువన మోహినీదేవి. ఇప్పుడు మన పనికి ఆవిడ తప్పక పనికివస్తుంది. మనల్ని బాగా యెరుగుననుకో''

''ఊ పద. ఆలస్యంఅమృతంవిషంఅన్నారు పెద్దలు! లే'' పట్టుమని పది నిముషాలు తిరక్కముందే రవి భువనమోహినీదేవి యింటిముందు ప్రత్యక్ష మయ్యాడు. భువనమోహినీదేవికి మొదట్లో కొంచెం ఆశ్చర్యం వేసింది తన యింటితలుపు తట్టేవారు యెవరాఅని. తలుపు తెరచి రవిని చూచిముందు అశ్చర్యము తరువాత ఆనందమూ పొందింది ఆవిడ. రవి యెప్పుడూ తన కుటుంబానికి ఆప్తవర్గంలో చేరినవాడే! చెప్పాలంటే భువనమోహినీదేవికి ప్రకటనలో వెలువరించిన లక్షణాలు అన్నీ వున్నాయి. ఒక్క అందమూ, ఆస్థి, వయసు మినహా.

మోహినీదేవి తెచ్చియిచ్చినమంచినీళ్ళ గ్లాసు నిముషంలో కాళీచేశాడు రవి కుశల ప్రశ్నలు, అవీ యివీ అయిన తరువాత మెల్లగా అసలు విషయం ఆవిడచెవిని వడవేశాడు రవి. ఆవిడకు ఆశ్చర్యము, అనుమానమూ అన్నీ కలిగినవి.

''అయితే మీరు చేస్తున్న పని న్యాయమయిన దేనంటారా?''

రవి ఉపన్యాస ధోరణిలో చెప్పుకపోసాగాడు.

"మా ఒక్క ప్రకటన వెలువడనీయండి. అప్పుడు తెలుస్తుంది ఆంధ్రప్రదేశ్‌లో యెంతమంది సహృదయులు వున్నదీ. అందాజ్‌గా మూడువేల అప్లికేషన్సయినా వచ్చి తీరుతాయి అని అనుకుంటూవున్నాము. విన్నారూ? శ్రీ 420లు, భగ్న హృదయులు, ఆవారాలు,...వీరందరికీ మన ప్రకటన మంచి ఔషధము అని అనుకోండి. అసలు యెంతో తమాయించుకొని "నైతిక ప్రచార పరమ ప్రాయోజక పరిణయ ప్రతినిధి సంస్థ' అనే దాన్ని స్థాపించకుండా వుండగలిగాము. ఏమంటారు? మీకు తృప్తయిందా?"

"అవునవును. మిమ్ముల్లను నేను ఎరుగనేమిటి? ఇప్పుడయితే రావటం లేదుగాని ఆయన వున్నప్పుడు వస్తూనే వుండేవారుగా. ఇంతకూ నేను చేయవలసిన పని యేమిటి? మీ అంచనా ప్రకారం రాబోయే మూడువేల మందిని 'ఉఫ్' అని ఒక్కసారే ఊదెయ్యొచ్చా? లేక ఒక్కొక్కరిని బొట్టుకాటుక పెట్టి పంపించాలా?"

"మీ పనల్లా అందంగా తయారయి టాజ్ హోటల్‌లో కూర్చోవటం. రైలు ఖర్చులు దొరికితే యెవరన్నా యిక్కడకు రావటానికి ప్రయత్నించవచ్చు. వారికి మాత్రం మర్యాదగా వచ్చినత్రోవ చూపించవలసి వుంటుంది."

"అంతేనా?"

"అన్నట్లు మరిచిపోయాను. మీకు నెలకు వందరూపాయలు జీతం. ఖర్చులన్నీ మావే."

"ఒక్క ఐదునిముషాలు టైం యివ్వండి. ఇప్పుడే వచ్చేస్తాను. ఇవాళిటినుండే మీ క్రింద పనిచేస్తున్నట్లు లెక్కించుకోవచ్చు."

తరువాత భువనమోహినీదేవికి టాజ్‌హోటల్‌లో మకాం యేర్పాటు చేయబడింది. ఆరోజే రవి వెళ్లి ఆంధ్రా బ్యాంకులో భువనమోహినీదేవి పేర రెండువేల రూపాయలు వేసివచ్చాడు. ఇలాటి వ్యాపారాల్లో రవి ఆరితేరిన చేయని చెప్పక తప్పదు.

కవి అండ్ రవి కంపెనీవారు వెలువరించినది ఒకేఒక ప్రకటన! అదీ ఆంధ్రప్రదేశ్‌లో అనన్య ప్రచారంగల దినపత్రికలో. ఆ ఒక్క ప్రకటనతోనే కవి, రవులకు రోజుకు అర్ధరోజు పని తగిలింది. కనీసం వందవుత్తరాలన్నా వుంటయి ఉదయం మొదలు సాయంకాలంవరకు వచ్చే వాటిని కలుపుకొంటే. సమాధానాలు వ్రాయలేక కవికి, కవర్లు విప్పలేక రవికి చేతులు తిమ్మిర్లు యెత్తసాగినవి. అందమైన వితంతువును, ఆవిడ ఆస్తిని కలిపి సరిదిద్దుకోటానికి సంసిద్ధులైన విశాలహృదయులు. అంటే పూటకు ఠికాణా లేని పెద్దమనుష్యులు ఆంధ్రప్రదేశ్‌లో అంత మంది వున్నారా అని ఆశ్చర్యపోయారు కవి అండ్ రవి కంపెనీ భాగస్థు లిరువురూ!

వారికి వచ్చిన లేఖలు వింతవింత రకాలు. కాళిదాసు కవిత్వం, వారి పైత్యం కొంతకలిపి కవిత్వాలు ఒలికించిన కవి కుమారులు వ్రాసిన వలపు కమ్మలు వర్ణనాతీతాలు. కొందరు ప్రపంచంచేత అర్థం చేసికోబడలేకపోయారు. కొందరకు ఉద్యోగాలు వూడిపోయాయి. వీరందరికీ భువనమోహినీదేవి ఒక్కరితే శరణ్యమయింది. వారి లేఖలలోని భాష వేరయినప్పటికీ అందరి భావము మాత్రము యించుమించూ ఒకటే. ఏకాంత వాసిని జీవితాన్ని వింత అనుభూతులతో నింపి చిగురింపజేసి తమ జీవితాలను అంకితం చేయటానికి సంసిద్ధులుగా వున్నామని తెలుపుకొన్నా రందరూ!

ప్రతివారికి కవి అండ్ రవి కంపెనీనుండి జవాబులు వెళ్ళి పోయినవి. జవాబులు అన్నీకూడా ఒకే అచ్చు. "మీ ఉత్తరంలో నిష్కల్మషమైన భావాలను చూచి ఏకాంతవాసిని ద్రవించిపోయింది. మీ వివరాలు ఇంకా కొన్ని పంపించండి. వీలుగావుంటే మీ ఫోటో ఒకటి జతపరచండి. కవి అండ్ రవి కంపెనీవారు మీ రెండవ ఉత్తరాన్ని ఏకాంతవాసినికి అందజేసేందుకు తమఫీజు క్రింద రెండురూపాయలు పుచ్చుకొంటారు."

పథకం బ్రహ్మాండమైన విజయాన్ని పొందింది. నూటికి తొంభై తొమ్మిది మంది అడుక్కుతినో, అప్పుపుచ్చుకొనో, అప్పణంగా కొట్టేసో, తలక్రిందులా తంటాలుపడి రెండురూపాయల ఫీజుతోపాటు మరికొన్ని వివరాలు చేర్చి రెండవ ఉత్తరాన్ని కవి అండ్ రవి కంపెనీని పంపుకున్నారు. కొంతమంది ప్రబుద్ధులుమాత్రం స్వయంగా హైదరాబాద్‌కు బయల్దేరారు. వారిని 'క్యూ'లో నిలబెట్టి ఒక్కొక్కరినే మోహినీదేవి సమక్షానికి పంపించారు. మిగిలిన పనంతా ఆవిడే పూర్తిచేసింది. కారు ఖర్చులకోసం కంపెనీ దగ్గరకు వచ్చి సత్యాగ్రహాన్ని అవలంబించిన యే కొద్దిమందినోమినహాయిస్తే తప్ప. కవి అండ్ కంపెనీకి దరిదాపు రోజుకు రెండువందలదాకా గిట్టుబాటవుతున్నది.

మధ్యాహ్నం ఒంటిగంట అవుతుంది. రవి నోట్లకట్టలను సిగరెట్టు పెట్టెలోకి మడుస్తున్నాడు. కవి.

"బాకా బాజా డోలూ సన్నాయ్
మోహినిపెండ్లికి మోగుట లేదే"

అనే ద్విపదను యీలపాటగా పాడుతున్నాడు. ఇంతలో హఠాత్తుగా ఒకవ్యక్తి లోపలికి ప్రవేశించాడు. కవీ, రవీ ఇద్దరూ ఆ వ్యక్తివైపు చూచారు. రవికి ఇదివరకే తెలుసు ఆ వ్యక్తి తమను పర్శింపటానికి ఎప్పుడో అప్పుడు తప్పక వచ్చి తీరుతాడని. అందుకనే అతడు ముందుగా అన్ని జాగ్రత్తలు తీసికొన్నది. రవి కన్నులు గర్వంతో ప్రకాశిస్తున్నవి.

"క్షమించండి మీకు శ్రమయిస్తున్నందుకు. ఈ దినం మీకు చాలా వుత్తరాలు వచ్చినట్లున్నయి"

"చాలావచ్చినయి బ్రదర్. చస్తున్నాము కవర్లు విప్పుకో లేక. మరిచిపోయాను. కొంచెం మంచినీళ్లు పుచ్చుకోండి ఎండలో వచ్చారు. తరవాత కావలసినంతసేపు చేసుకోవచ్చు పరిశోధన!"

కవి, రవులు ఆగంతకుని టాజ్ హోటలుకు తీసుకొని వెళ్ళారు. అతడు భువనమోహినీదేవిని చూచాడు. ఆవిడ పేరుతో వున్న బ్యాంక్ అకౌంటుబుక్కు కూడా కనిపించింది.

"అంతా సవ్యంగానే వున్నట్లున్నదే?"

"మీకు గనుక పెండ్లికాకుండా వుంటే మీరుకూడా ట్రై చేసి రావచ్చు. కావాలంటే మా ఫీజు రెండురూపాయలు మాత్రం వదలుకొంటాం."

"థాంక్సు. నాకు పెండ్లికాకుండా వుంటే ప్రయత్నించే వాడినే" అంటూ ఆగంతకుడు నిష్క్రమించాడు. అతడు సి. ఐ. డి. శాఖకు చెందిన ఉద్యోగి.

మూడు నెలలు గడచిపోయినవి. అక్కడక్కడ కంప్లె యింట్సు రాసాగినవి. కవి అండ్ రవి కంపెనీ నికరాదాయం ఐదువేలవరకు ఉంటుంది. ఇక ఊడాయిద్దామని నిశ్చయించు కొన్నారు భాగస్థులిద్దరూ. మోహినీదేవికికూడా మోజు తగ్గి పోయింది. అలాగే కొన్నాళ్ళు గడుస్తే తను ఒక దేవతగా మారి ఆంధ్రులంతా అక్కడకు తీర్థయాత్రలు ఆరంభిస్తారేమో ననే భయంకూడా పట్టుకున్నది ఆవిడకు.

రవి టాజ్ హోటలుకు బయల్దేరాడు అన్నీ చక్కబెట్టేసుకుం దామని. రవిని చూడడంతోనే బావురుమన్నది భువన మోహినీదేవి బడికి వెళ్ళేందుకు యిష్టంలేని పసిబాలికలాగా. క్రమక్రమంగా శ్రుతి మించి ఆరున్నొక్కరాగంలో పడింది.

" అరే! అదేమిటమ్మా? ఎవరన్నా యేమన్నా అన్నారా? "

"అబ్బే ఎవరూ ఏమీ అనలేదు రవీ! నీవు నాకు తమ్ముని లాటివాడివి. ఆయన వున్నప్పుడు నిన్ను గురించి యెంతగా చెప్పేవారనుకున్నావు? ఇంతకూ నిజం చెబుతున్నాను. నాకు ఇప్పుడు నిజంగానే పెళ్లిచేసుకోవాలనే భావం కలిగింది. నేను ఒకతనిని ప్రేమిస్తున్నాను. అతనిని యెంతగాఢంగా ప్రేమిస్తు న్నానో మాటలతో చెప్పలేను. అతనిని పెండ్లిచేసుకోకపోతే నా ప్రాణాలు నిలువవనుకో. సరిగా నేను ఇన్నాళ్ళు మన సులో ఊహించుకొంటున్న వ్యక్తి అతడే!"

"శుభశ్య శీఘ్రం అన్నారు. దానికి యింత గొడవ ఎం దుకు? వెంటనే చేసేసుకోండి అంటే అతడుకూడా ఇష్ట పడితేనే."

"అతడా? రోజూ నన్ను చూస్తూనేవున్నాడు. కాని, రెండు వేల రూపాయలు యిస్తేగాని అంగీకరించనని అంటున్నాడు. అతని పేరు కుమార్" తిరిగి యేడుపు లంకించుకున్నది భువన మోహినీదేవి.

కలికి కన్నీరు యెంత కఠినుని మనసునయినా కరగించి వేస్తుంది. అందులో రవి మనసు చాలా మెత్తనిది.

"మాకు యిందులో యేలాగూ ఐదువేలవరకు లాభం వచ్చింది. మీకు రెండువేలు యిచ్చినందులో పోయేదేమీ లేదు. అయినా కవినికూడా అడిగిచూడాలి. ఇందులో మేము యిద్దరమూ సమ భాగస్థులము" అంటూ లేచి రవి కవిదగ్గ రకు వచ్చి జరిగినదంతా చెప్పాడు.

"నేను అనుకుంటూనేవున్నాను యిలాంటిది ఏదో వచ్చి పడనే పడుతుందని. భాషో(్ర దేశాలను రెచ్చగొట్టే యిలాంటి పథకాలలో స్త్రీలను నమ్మకూడదు బ్రదర్"

"అదికాదు కవీ! మన మూలంగా ఒక స్త్రీ భగ్నహృదయ కాబోతుంటే మనం సహించి వూరుకో గలగటం న్యాయ మేనా!"

"అవును రవీ! నీ మనసు నవనీతం. సరే నీ యిష్టం వచ్చి నట్లే చెయ్యి. ఈ ఒక్కసారయినా నీవు చెప్పినట్లు వింటాను. వేగిరమే వెళ్ళి ఆవిడ పేరుతోవున్న రెండువేలూ తీసుకొని ఆమె ఆరాధిస్తున్న ఆరాధ్యదైవానికి అప్పించుకోమను. ఆ నవదంపతుల యిద్దరినీ చిలుకా గోరింకలలా చిగురించమని ఆశీర్వదించిరా"

రవి ఆనందంతో కవి రెండుచేతులను గట్టిగావూపాడు. మరుక్షణంలోరవిభువనమోహినీదేవిదగ్గరకువచ్చి కవిఅంగీకరించిన వార్త తెలిపాడు. ఆవిడ కనుగొలుకులనుండి ఆనందాశ్రువులు ముత్యపుబొట్లలా రాలి నేలమీదకు దొర్లినవి.

రెండురోజుల తరువాత కవీ రవీ ఇద్దరూ గదిలో కూర్చొని సామానులు సర్దుకుంటున్నారు.

"ఒకసారి నీవు భువనమోహినీదేవిని చూచివస్తే బావుంటుందని అనుకొంటాను. ఆవిడ నిన్నుగురించి తెలుసుకోవాలని అనుకొంటూ వుంటుంది. నిన్ను చూచి నిజంగా చాలా సంతోషిస్తుంది. ఏమంటావు కవీ!"

"ఎందుకు బ్రదర్ టైం వేస్టు. మనం యెంత త్వరగా బయల్దేరి రైలు అందుకొంటే అంత మంచిదనుకొంటాను." రవి నోట్లకట్టలను ఒక్కొక్కదానినే తీసి తోలుపెట్టెలోకి సర్దుతున్నాడు.

"దీనినికూడా లోపలపెట్టెయ్" అంటూ జేబునుండి ఒక నోట్లకట్టను తీసి కవి రవిచేతికిచ్చాడు.

"ఇదేమిటి?"

"ఇదా? ఇది భువనమోహినీదేవిగారి రెండువేలు"

"అయితే నీకెలా వచ్చింది?"

"నాకా? ఆవిడే యిచ్చింది. గత నెలనుండి మనం ప్రతి దినమూ సాయంకాలాలు ఆవిడ దర్శనం చేసికొని వస్తున్నాములే"

"అయితే కుమార్ అంటే నీవేనా కవీ!"

"అందుకుసందేహమా రవీ!" అన్నాడు కవి నవ్వుతూ.

(ఆధారం : ఒహెన్రీ)

# తలపు పిలుపు

ప్రభుత్వాధికారి జగపతి హత్య జరిగి సుమారు రెండు సంవత్సరాలు అయివుంటుంది. స్ప్రెన్సర్ హోటల్‌లో కూర్చొని బ్రాందీ త్రాగుతున్న హంతకుడితో డిటెక్టివ్ నళినీమోహన్ తారసిల్లుతాడు.

"హలో, జయరామ్, కులాసాయేనా?"

"అరే మోహన్! నీవా! ఎన్నాళ్ళయింది కనబడి ఏం చేస్తున్నావిప్పుడు?"

"కొన్నేండ్లు బొంబాయిలో వుండేవాడినిగదా! అప్పుడు సి.ఐ.డి. లో డిటెక్టివ్‌గా పనిచేస్తూవుండేవాడిని."

"వెరీగుడ్. చాలా బాగావుంది."

అలా లోపలికెళ్ళి కూర్చుందాము రా. కొంచెంసేపు బాతాఖానీ కొట్టుకోవచ్చు.

నాల్గింటికి ఐదు నిమిషాలు వుంది. జనం రద్దీ ఇంకా పూర్తిగా తగ్గలేదు. ఇద్దరూ లేచి మూలన ఖాళీగావున్న ఒక టేబుల్ దగ్గరకు చేరారు. జయరాం చక్కని పెనామా సూట్ వేసికొని వున్నాడు. అటు ఇటు తిరుగుతోన్న మెల్ల కండ్లలో కొంచెం తొట్రుపాటు కనిపిస్తోంది. పైకిమాత్రం గంభీరంగానే అదురూ బెదురూ లేక ఆత్మ విశ్వాసంతో నళినీమోహన్‌కు ఎదురుగావున్న కుర్చీలో కూర్చున్నాడు.

"అయితే జయరాం నీవు ఇప్పుడు ఏం చేస్తున్నట్లు? ఢిల్లీనుండి నాకన్నా ఒక ఏడు ముందే వచ్చేసావనుకుంటాను. అంతేగదా!"

"నేనా, ఇప్పుడు ఒక బొగ్గులగని వ్యాపారం చేస్తూవున్నాను. ప్రస్తుతం దానికి షేర్లు అమ్ముతున్నాను. బహుశా త్వరలో ఇక్కడొక ఆఫీసు ఆరంభిస్తాననుకొంటాను. అయితే మిస్టర్ మోహన్ బొంబాయి డిటెక్టివ్ లన్నమాట. నేను ఢిల్లీ నుండి వచ్చినతరువాత కొన్నాళ్ళు పోలీసు శాఖలో పని చేశావుగదూ?"

"అవును. ఆరు నెలలు. జయరాం, దల్లకు వచ్చి ముంత దాచటం ఎందుకు? కలకత్తాలో ఆ బ్యాంకి దోపిడీ జరిగినప్పటినుండీ నీమీద ఒకకన్ను వేస్తూనే వస్తున్నాను. ఇంతకు ముందెప్పుడూ నీ చేయి తుపాకీమీదికి పోలేదనుకుంటాను. ఇంతకూ జగపతిని ఎందుకు చంపావు?"

ఫోర్కుతో ఎత్తిన ఆమ్లెట్ ముక్కను అలాగే మధ్యలోనే ఆపేసి జయరాం మోహన్ వైపు వింతగా తేరిచూశాడు. కొంచెం తేరుకొని మోహన్ మొహంలోకి కొంటెగాచూస్తూ.

"నీవెలా వూహించగలిగావు మోహన్? బ్రహ్మకుకూడా చిక్కకుండా చాలా నేర్పుగా ముగించేశాననుకున్నానే? ఎక్కడో పప్పులో కాలేశానన్నమాట. అంతేనా?" అన్నాడు జయరాం.

కోటుజేబులోనుండి ఒక చిన్న బంగారపు పెన్సిలు తీసి టేబిల్ మీద పెడుతూ "జయరాం, నీకు ఢిల్లీలో వుండేటప్పుడు ఒకసారి నీ పుట్టినరోజు పండుగకు ఈ పెన్సిలు బహుమతిగా ఇచ్చాను గుర్తుందా? ఇది జగపతి పడుకొన్న గదిలో ఒక మూలగా దుప్పటికింద పడివుంది. ఇక చెప్పబోయేది బాగా ఆలోచించుకొని చెప్పు. మనం ఇద్దరమూ స్నేహితు

లమే కాని, విధ్యుక్తధర్మం స్నేహంకన్నా గొప్పది. జగపతి హత్యకు నీవు పురికంబం ఎక్కక తప్పదు.''

జయరాం నవ్వుతూ అన్నాడు.

"ఇంకా అదృష్టం నన్ను వదలిపెట్టి పోలేదు. అయినా మోహన్ నన్ను వెంటాడుతున్నాడని నేను కలగన్నానా?"

జయరాం చేయి ఫాంటు జేబులోకి పోవటంచూచి వెంటనే మోహన్ చేతిలోకి రివాల్వరు తీసికొన్నాడు.

"దానిని లోపల దాచేయి. నేను పూరకనే పరిశోధిస్తున్నాను. జేబుకు రంధ్రంవున్నది. పెన్సిలు దానిగుండా క్రింద పడి వుంటుంది. ఇంక జగపతిని ఎందుకు హత్యచేసింది చెబుతాను విను."

ఆ ముసలిపీనుగు వెంటబడి నన్ను కాల్చాలని చూచాడు. మరి ఏంచేయమంటావు చెప్పు. కాని ఆవిడ మాత్రం పరమ సాధ్వి పాపం! పంద్రెండువేల డయిమొండ్ నెక్లెసు పోతుంటే కదలక మెదలక కండ్లార్పక పడుకొంది. కాని, పాతిక రూపాయల వుంగరాన్ని మాత్రం వదలి వెళ్ళమని దీనంగా ప్రార్థించింది. ఇంతకూ ఆవిడ పెండ్లాడింది జగపతినికాదు, అతని డబ్బునను కొంటాను."

''ఆపెయ్, జయరాం. ఎవరి ముందు మాట్లాడుతున్నావు కొంచెం తెలుసుకొని మాట్లాడితే బావుంటుంది."

''కొంచెంకాదు బాగా తెలుసుండబట్టే మాట్లాడ్తున్నాను. మిష్టర్ మోహన్ కొంచెం గుర్తు తెచ్చుకో. నీవు నాకు రెండు వేల రూపాయలు బాకీవున్నావు. ఒకవేళ నీవు నన్ను అరెస్టు

చేద్దామని అనుకొన్నా నీ చేతులుమాత్రం ఆపని చెయ్యలేవు. నాకు బాగా తెలును.''

''అవును. నేను మర్చిపోలేదు. నీమేలు జన్మలో మరిచి పోలేను. నిజంగా ఆ డబ్బే నా ప్రాణాన్ని రక్షించింది. ఇరవై వందరూపాయలనోట్లు నీచేత్తోనే లెక్కించి ఇచ్చావు—అవును, నేను ఇంటికి వెళ్ళేటప్పటికి సామాన్లన్నీ దొంతర్లగా పేర్చ బడి వున్నవి.''

''ఒక్కసారి నీ హృదయాన్ని అడిగిచూడు. నీవు బాకీ వున్నవాడిని నీ చేతులతోటే అరెస్టు చేయగలవేమో? అబ్బాయీ, వెయిటర్‌ను పిలుస్తాను గుడ్‌బాయ్ లాగా కూర్చొని కావలసినవన్నీ తినూ, త్రాగు. మొఖం వాచినట్లు యింది. వ్యాపారం చేసేటప్పుడు నేను దాని వాసనకూడా చూడను. కొంచెం తీరిగ్గా దాహం తీర్చుకొందాం'' (వెయిటర్ వచ్చి ఆమ్లెట్, బ్రెడ్, బిర్యానీ, పానీయాలు అన్నీ బల్ల మీదపెట్టి వెళ్లిపోతాడు.)

''నిజమే నీమీద చేయి జేసికోలేను. నీ బాకీయే గనుక తీర్చేసివుంటేనా?—కాని లాభమేముంది? ఒకసారి నాకు నీవు సహాయంచేశావు. తిరిగి నీకు నేను చేయాలి.''

''నాకు బాగా తెలుసు మోహన్ నీవాపని చేయలేవు. మన స్వత్వాలు నాకు అర్థం అయినంత బాగా ఎవరికీ అర్థం కావు.''

''మన ఇద్దర మధ్యవున్న బాకీయేగనుక పరిష్కారం అయి పోయివుంటే బొంబాయిలోవున్న అన్ని బ్యాంకులలోని డబ్బు మొత్తం తెచ్చిఇచ్చినా వదిలేసి వుండేవాడినిగాను'' మన

సులో ఆలోచించుకొంటున్నట్లే ఈ మాటలను పైకి అన్నాడు నళినీమోహన్.

"ఆ సంగతి నాకు తెలుసు. నీ చేతుల్లో నాకేమీ భయం లేదనికూడా తెలుసు."

"చాలామంది నా వ్యాపారంలో తప్పులు పట్టాలని చూస్తారు. నా వృత్తిమీద నాకొకవిధమైన గర్వం. అసలు వాళ్ళదృష్టిలో ఇదొక కళేగాదు. నిజంగా ఇవాళ నా అహంభావం దెబ్బతిన్నది. నేను ముందు మానవుడిని, తరువాత డిటెక్టివ్‌ను. అందువల్లనే ఇప్పుడు నిన్ను వదిలేస్తున్నాను. కాని, వెంటనే నా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేస్తాను. అబ్బాయీ దీంతో నీ బాకీ తీరిపోతుంది."

"ఓ దానికేం? బాకీని ఎప్పుడో వదిలేద్దామనిఅనుకొన్నాను. కానీ నీవు వప్పుకోవని వూరుకొన్నాను. ఇంతకూ నాదగ్గర నీవు బాకీ పుచ్చుకొన్నరోజు చాలా మంచిదన్నమాట. ఇక ఆగొడవలన్నీ మరిచిపోయి శుభ్రంగా త్రాగెయ్. ఇది, విచారాలకు విరుగుడు, ప్రమాదాలకు పరమవ్రుషధం. పోలీసు కుర్రాళ్ళు తల బద్దలుకొట్టుకుంటూ వుంటారు. మనం ఇక్కడ హాయిగా త్రాగుతూ కూర్చొందాం. ఇవాళ సహారా ఎడారిలో ప్రయాణీకునికిలాగా నాకుకూడా అంతులేని దాహం పట్టుకొన్నది." త్రాగుతున్నంతసేపు తను చేసిన ఘనకార్యాలను గురించి గప్పాలు కొడుతూనే వున్నాడు. అతనికివున్న ఒకేఒక లోపం అహంభావం. జయరాంమీద బాగా విరక్తి పుట్టుకొస్తున్నది. కాని, ఒకప్పుడు తనకు మేలు చేసినవాడని ఇవన్నీ సహించగల్గుతున్నాడు నళినీమోహన్.

"నామటుకు నేను నిన్ను వదిలేశాను. అయినా నీవు జాగ్రత్తగా వుండటం మంచిది. నగరంలో దోపిడీలు, హత్యలు అంటువ్యాధిలా వ్యాపించివున్నాయి. జగపతివ్యవహారం పత్రికలవాళ్లు పట్టించుకోవచ్చు."

పత్రికలవాళ్ళమాట వింటంతో తోక త్రొక్కిన పాము లాగా లేచాడు జయరాం.

"ఆహాహా! పత్రికలవాళ్లుట! బావుంది. వాళ్ళు చేసేదేమిటి? ఎక్కడన్నా హత్య జరిగింది అంటే అక్కడికి ఈగల లాగా ముసురుతారు. తరువాత దగ్గరలోవున్న యే బార్ లోనో కూర్చొని బీర్ త్రాగుతూ బాతాఖానీ ఆరంభిస్తారు. లేకపోతే నాల్గో అంతస్తులోవున్న ఏ నారాయణమూర్తికో నాల్గు పోజుల్లో ఫోటో తీసేసి మొదటి పేజీలో వేసేసి కొంటారు. అంతేనా?"

"ఏమో? అయితే అయివుండవచ్చు. కాని, కొన్ని పత్రికలు మాత్రం ఇలాటి విషయాలలో బాగా పనిచేసాయి. ఉదాహరణకు 'టైమ్స్'నే తీసికో. ఎన్నిసార్లు పోలీసులు పరిశోధనలు వదలిపెట్టిన తరువాత నేరగాళ్లను పట్టించిందో తెలుసా?"

"ఓ, అలాగా. ఒక్కనిముషం." అంటూ జయరాం లేచి అక్కడకు మూడడుగుల దూరంలోవున్న టెలిఫోన్ బూత్ లోకి తలుపు తెరుచుకొని వెళ్ళిపోయాడు. డైరక్టరీ తీసి క్రిందికీ పైకీ వెదకి చివరకు ఒక నెంబరు డయల్ చేశాడు.

"ఓ, అది 'టైమ్స్' ఆఫీసేనా? నాకు మేనేజింగ్ ఎడిటర్

కావాలి—ఎందుకు? జగపతి హత్యగురించి ఎవరో మాట్లాడా లంటున్నారని చెప్పు...''

"ఎవరు? ఎడిటర్ గారా? నమస్తే!—నేను జగపతిని హత్య చేసిన వ్యక్తిని—అరే కొంచెం ఆగండి—అలా పెట్టేయకండి. మామూలుగా డాబులుకొట్టే రకంకాదు నేను.—వో—ఏమీ ప్రమాదంలేదు. ఇప్పుడే ఒక డిటెక్టివ్ స్నేహితుడితో ఆ విషయమే చర్చిస్తున్నాను. రేపటికి కచ్చితంగా రెండు వారా లవుతుంది వాడిని చంపి—ఆ—రాత్రి గెంగుర్నరకు. ఏదన్నా డ్రింక్ వుందా దగ్గరలో—అరే! ఆమాత్రం కనుక్కోలేనూ? టోకరాలు ఇచ్చేవాడయింది కాందీ? నీ పేపరుకు కావలసి నంత మేత!—బావుంది. అంతే. అయినా నా అడ్రసు, పేరు ఇచ్చి మాట్లాడుతానా? ఎందుకంటే, పోలీసులు వదిలేసిన కేసులు పట్టుకోటంలో తమరికి ప్రజ్ఞ వున్నదని తెలిసిందిలే— కాదు, అంతేగాదు. తమబోటి చవుకబారు పత్రికలవాళ్ల మట్టిబుర్రలకు మాలాంటి ఘటాలు చిక్కవని రుజువుచేద్దా మని—ఏమిటి?—అబ్బే! ఎంతమాత్రమూ కాను. ఇది మీ పోటీ పత్రిక ఆఫీసు గాదు. నేరుగానే మాట్లాడుతున్నాను. నేనే జగపతిని చంపింది. సొమ్ములన్నీ నా సూట్ కేసులో— 'ఆ హోటల్ పేరేదో కనుక్కోవటానికి సాధ్యంకాలేదు'. గుర్తుపట్టావనుకొంటాను. అలాగే అనుకొన్నాను. మీ మామూలు చొప్పదంటుపాటేగా అది. ఆపెయ్—నీవు వట్టి ఫూల్ వని అనుకోను—అయినా నీ కంఠధ్వనినిబట్టే చెప్పగ లను. కొంచెం వుండు. నీకు కావాలంటే గుర్తుకూడా చెబు తాను. మీ కోతిమూకంతా ఇందులో పనిచేసిందనే అను

కొంటాను. జగపతి భార్య జాకెట్ పై బొత్తం పగిలిపోయి వుంటుంది. నేను వుంగరం తీసేటప్పుడు చూచాను. అది మరకతం అని అనుకొంటాను.—ఆ పెయ్. లాభం లేదు.”

చిరునవ్వు నవ్వుతూ మోహన్ వైపు తిరిగి.

“బాగానే నమ్మాడు. ప్రక్కనవాడితో ఎక్స్చేంజిని పిలిచి ఏ నెంబరు నుండి మాట్లాడుతున్నదీ కనుక్కోమని చెబుతున్నప్పుడు, పాపం ట్రాన్స్‌మిటర్ పూర్తిగా చేత్తో కప్పెట్టలేదు. ఇప్పుడే వచ్చేస్తానుండు.”

హాల్లో—అవును, నేనే! ఇక్కడనే వున్నాను ఇంకా. అరే నీలాటి బుక్కాపకీరు పేపరు బూచీలను చూచి పారిపోయే రకంగాదు బ్రదర్. నలభైఎనిమిది గంటలలో నన్ను పట్టుకొంటావా? స్కుఖియా! అయినా ఏ విడాకుల వివాదాలో, కారు ప్రమాదాలో కావలసినంత చెత్త దొరుకుతున్నప్పుడు ఈ గొడవంతా ఎందుకు చెప్పు—సారీ. నిన్ను చూచేందుకు టైము లేదు. అయినా నీదగ్గర ప్రమాదం ఏంవున్నది? బై—బై—.”

“ఎలుకను వదలిన పిల్లిలాగా అలుక వహించాడు సంపాదక మహాశయుడు” అనుకొంటూ రిసీవర్‌ను తగిలించి నళినీ మోహన్ దగ్గరకు వచ్చి “మోహన్, లే. అలా నిద్ర వచ్చిందాకా ఏ సినిమాకో పోయి వద్దాము. పొద్దున్నే లేచి నేను బొంబాయి రైలెక్కేస్తాను.” ఇద్దరూ వెళ్ళి టాజ్ హోటల్లో భోంచేసి పిక్చర్‌కు వెళ్లారు. ఆ రాత్రి మొత్తానికి జయరాం జానపద చిత్రాలలోని రాజకుమారులలాగా దర్జాగా ఖర్చు పెట్టాడు.

ఆ ఇద్దరూ తెల్లారుగట్ల ఐదుగంటలకు హోటల్లో కూర్చొని కాఫీ త్రాగుతున్నారు. జయరాం చేతిలో లేత లేత సొరకాయలు తెగుతూనేవున్నవి. మోహన్ మెదడులో తీవ్రమైన సంఘర్షణ జరుగుతూనే వున్నది. న్యాయాన్ని రక్షించటం ఎలాగా అని పరిపరివిధాలా ఆలోచిస్తున్నాడు. హటాత్తుగా అతనికళ్లు ఆనందంతో మెరిసినవి. ''అది సంభవమేనా అని ఆశ్చర్యపోతున్నాను'' అని తనలో అనుకొననాగాడు.

''ఆ—శ్చ—ర్య—పోతున్నాను. అది, సం—భ—వమేనా అని''.

ప్రత్యూష పవనాంకురాలు వీస్తున్నాయి. అప్పుడప్పుడే మొదలెట్టిన కార్ల చప్పుడు, పాలకావిళ్ళ పరుగులు ప్రత్యూషపు ప్రశాంతతను కొంచెం కొంచెంగా భంగపరుస్తూ వున్నాయి. దూరంగా పేపరు కుర్రాళ్ళ కేకలు బావిలో నుండి వినిపించే కేకలలాగా సన్నగా వినిపిస్తూ వున్నాయి. విషాదమూ, వినోదమూ, విలాసమూ, విజ్ఞానమూ, హాస్యమూ, హత్యా, వుదంతమూ అన్నీ వుంటాయి దాంట్లో. గోడకు తగిలించిన కేలండరులో ఒక పేజీ మారిపోతూ వుంటే ఒక్కొక్కరి జీవితంలో ఎన్ని వ్యధల కథలు, ప్రతీకార వాంఛలూ మారిపోతూ వుంటాయో? క్రమంగా పత్రిక కుర్రాళ్ళ కేకలు నలుదిక్కులా వ్యాపించినవి.

మోహన్ వేడివేడి కాఫీ త్రాగుతూ వెయిటర్‌ను పంపించి ఒక టైమ్స్ పత్రిక తీసుకరమ్మన్నాడు. పేపరు మొదటి పేజీ చూచి పాకెట్ డైరీలో నుండి ఒక పేజీ చింపి ఆ చిన్న బంగారపు పెన్సిలు తీసి గబగబ రెండు ముక్కలు గీసేసాడు.

"మోహన్, ఏమిటి విశేషాలు?"

మోహన్ మాట్లాడకుండా ఆ చీటీ ముక్క జయరాం ముందుకు నెట్టాడు.

"టైమ్స్" పత్రికకు:

"అతనిని పట్టుకొని అరెస్టు చేసినందుకు నాకు రాబోయే రెండు వేల రూపాయల బహుమానము జయరాం ఆర్డరుకు ఇవ్వవలెనని కోరుతున్నాను"—నళినీమోహన్.

"వాళ్ళతో నీవు సరససల్లాపా లాడుతున్న సమయంలో వాళ్లు చేసినపని ఇది. మిస్టర్ జయరాం ఇక నాతోపాటు స్టేషన్‌కు నడువు" అన్నాడు మోహన్.

ఆధారం : ఓ హెన్రీ.

---

## తోడేలు లోకం

నిన్న మొన్నటిదాకా, అంటే భారతంలో స్వాతంత్ర్యం అడుగుపెట్టేటప్పటివరకు రామచంద్రం పేరు విననివాళ్లు చాల మంది వున్నారంటే యివాళ ఆశ్చర్యంగానే కనుపించవచ్చు. ఎందుకంటే ప్రస్తుతంలో ఆయన ఆర్జించిన డబ్బూ, కీర్తిప్రతిష్టలు అప్పటిలో లేకపోవటమే? గతంలో జరిగినకథ స్మృతిపథానికివస్తే నిజంగా ఆయనలో యేమాత్రమైనా మార్పు వస్తుందా అనే విషయం సందేహాస్పదము!

మొట్టమొదట తండ్రి చనిపోయేటప్పటికి ఆయన యింట్లో (అది అద్దెయిల్లేనని ప్రస్తుతంలో చెప్పటం యెంతో అవుసరం)

ఒక పూచికపుల్లేనా లేదు. పోనీ అయ్యగారిచదువు చూద్దామా అంటే పొట్టకోసినా అక్షరంముక్క యేకోశానా కన్పించదు. అటువంటి దౌర్భాగ్యుడి జీవితంలో యింత విశిష్టమైన పరివర్తనరావటం అంటే యేమీ తెలీని వాళ్లకొక చిక్కు సమస్యగానే కన్పించవచ్చు. కాని ఆయన జీవితగ్రంథంలోని పుటలను జాగ్రత్తగా త్రిప్పి, అందులోని విషయాలను సక్రమైన విభజన చేసి చూస్తే అది అంత గడ్డుసమస్య కాదని సులువుగా తెలిసికోవచ్చు.

రామచంద్రం జీవితసోపానంలో సావిత్రమ్మ మొదటి మెట్టని చెప్పవచ్చు. జ్యోతిష్యశాస్త్రం బాగా తెలిసిన వాళ్లాయన చెయ్యిచూచి దాంట్లో యెక్కడా కళ్యాణపుగీత లేదని రూఢిగా నిర్ధారణ చేసివుండవచ్చు. మరి అది యెక్కడవున్నదోగాని, రామచంద్రానికి రంగనాథంగారు తనకూతురునిచ్చి పెండ్లిచేసేసాడు. తన పొట్టే పోషించుకోలేని అసమర్థుడికిలా పిల్లనిచ్చి ఆ అమ్మాయి గొంతుకోయటంలో అంతరార్థం అప్పుడే బట్టబయలయింది. అందులో మొదటిఅంశం యేంటంటే రంగనాథం పేరుపొందిన పిసినిగొట్టు. దానివల్ల సులభంగా దమ్మిడీ ఖర్చులేకుండా తూతూమంత్రంతో దేవాలయంలో వివాహం జరిపించేయటం చాలా హాయిగా కనుపించింది. రెండోవది, యీ విషయంలో సావిత్రమ్మ సవతితల్లి ఆయనను బాగా ప్రోత్సాహించటం. అందువల్ల రామచంద్రం అతిసులువుగా ఒక యింటివాడయిపోయాడు. అర్ధాంగితోపాటు అన్ని విషయాలలోగూడా చెప్పుకోదగ్గ మార్పులు కనుపించసాగాయి. ఆయన అదృష్టంయేంటంటే సావిత్రమ్మ సాక్షాత్తు సావిత్రమ్మే! పతే

దైవమని నమ్మి సర్వస్వము ఆయన పాదాలచెంతవుంచిన పరమసాధ్వి ఆమె! జీవితరథం దొర్లిపోవటమేలా అనేదానికి మొట్టమొదటిగా ఆమే కొన్ని మార్గాలు చూపించింది. మొట్ట మొదటిరోజుల్లో యే షావుకార్లకు సలహాలివ్వో, లేకపోతే ప్లీడర్లకు పార్టీలకు మధ్య ఆ మాటలు యీ మాటలుచెప్పి డబ్బులాగటం మెల్లమెల్లగా అలవడ్డయి. అప్పట్లో సావిత్రమ్మ గూడా ధనవంతుల పిల్లలకు చేతితో చొక్కాలల్లటం, గడపల కందమయిన గుడ్డలల్లటం మొదలైన పనులతో కాస్తకూస్తా డబ్బు సంపాదిస్తుండేది. 'ఏటన్నిటికన్నా యెప్పటికన్నా మంచి రోజులు తప్పక వస్తయిలేండి మనకు, అని ఆమె చెప్పేధైర్యపు మాటలు ఆయనకొకవిధమైన అండగా వుంటూవుండేవి.

కాలచక్రం గబాలున తిరిగిపోయింది. ఓడలు బండ్లు, బండ్లోడలవుతవనే విషయం అసత్యంగాదని ఋజువయింది. స్వాతంత్ర్యోదయంతోపాటు చాలామంది జీవితాలలో అనేక మార్పులొచ్చినవనేదిమాత్రం నిజం! అయితే కొందరకు కష్టాలు పెరిగివుండవచ్చు. అంటే నిజమైన దేశభక్తులు అడుక్కుపోయి వుండవచ్చు. కాని అదేరీతిగా చాలామంది పైకివచ్చారనే విషయం నిర్వివాదాంశం! అటువంటి అదృష్టవంతులలో మన రామచంద్రంగారొకడు. విధినడక యెంతో విచిత్రమైందంటారు పెద్దలు. కాకపోతే మొన్నటిదాకా దరిద్ర దామోదరుడయిన రామచంద్రం నేడు కోటికి పడగలెత్తిన ధనవంతుడు! అది ఉట్రవుడియంగా ఆకాశంలోనుండి రాలిందా అంటే అది శుద్ధ అబద్ధం. లేకపోతే యేదన్నా లాటరీలో గెల్చాడా అంటే అదీ నిజంకాదు. నేడు రామచంద్రం ఆరితేరిన వ్యాపారస్తుడు.

అప్పుడప్పుడు చిన్నచిన్న వ్యాపారాలు చేస్తూనేవుండేవాడు. అంతమాత్రాన వ్యాపారంలోనే ఇంతడబ్బు సంపాదించగల్గాడని ఒక్కడినయినా గుండెమీద చేయివేసి చెప్పమనండి చూద్దాం. కాకపోతే ఒకమాటమాత్రం నిజం. ఆయన యెలక్షన్లలో చాలా కష్టపడి పనిచేసాడు. ఒక టేవిటి, తాలూకా కాంగ్రెసు యెలక్షన్ల దగ్గరనుండి యమ్. యల్. ఎ. యెలక్షన్ల వరకు ఆయన సహాయం లేకుండా ఆ ప్రాంతాల్లో గెలవటమనేది కల్ల. అందుకనే ఆయనకు తగిన సత్కారంచేయటం తమవిధి అనుకొన్నారు పదవి సంపాదించిన మహానుభావులు. అందుకనే ప్రస్తుతం సిమెంటుపర్మిట్లు, బస్సురూట్ల లైసెన్సులూ సర్వస్వం రామచంద్రానికి వస్తూవున్నవి. ఇప్పుడు బ్లాక్ మార్కెటు వ్యాపారంలో మొట్టమొదటివాడుగా చాలామంది ప్రజలు చెప్పుకొంటూ వుంటారు. కాని అది పైకిచెప్పాలంటే యెవరికైనా భయమే! కాని, రామచంద్రంగారిని గురించి యీ పూర్వగాథ అంతా తెలిసినవాళ్లు చాలామంది లేకపోలేదు. కాని ప్రస్తుతం ఆయన పరిస్థితి అందరూ చూస్తూనేవున్నారు. కావలసినంత డబ్బు, విశాలమైన భవనాలు, రెండు చెవర్లెటు కార్లు, ఒక టేవిటి ధనలక్ష్మి ఆయనయింట్లో దాస్యం చేస్తున్న దేమోనని అనిపిస్తుంది. ఆయనకు గిట్టనివాళ్ళు ఆయన మీద అనేక ప్రచారాలుచేయటం సహజం. కొంతమంది ఆయన ఇన్‌కమ్‌టాక్స్ కూడా కట్టకుండా తప్పించుకుంటాడని, పిల్లికైనా బిచ్చంపెట్టడనీ యేమేమో అంటూవుంటారు. అవన్నీ అప్రస్తుతం.

ఆయన గృహపరిస్థితులలో పూర్తిగా కల్లోలం బయల్దేరిందంటే దానికి డబ్బేకారణం అని చెప్పొచ్చు. బీదతనంలో బాధగాని, ఐశ్వర్యంలో గర్వంగాని యెరుగని సావిత్రమ్మగార్కి అన్యాయం జరగటం హృదయం అంటూ వున్నవాడెవడూ సహించలేడు. మునుపు కంటకింపయిన భార్య నేడు కంటగింపయింది. దుర్వ్యసనలోలుడికి స్వర్గసీమ అయిన గృహం నరకంగా కనిపించటంలో అబ్బురమేముంది? ఇప్పుడు రామచంద్రం సర్వస్వానికీ యజమాని సావిత్రికాదు, ఇందిర! ఇందిర, అంటే తెలీనివాళ్లెవరు? ఎదురూపాయలర్పించిన వాళ్ళందరి చేతుల్లోనల్లా నలిగి పిప్పయిపోయిన ఇందిర ముఖం మీద పులుముకున్న ఫేస్ పౌడర్ రామచంద్రాన్ని ఆకర్షించటం నిజంగా ఒక వింతసంఘటనేనని చెప్పాలి. కాని, యీ సంఘటన యేదో మామూలుగా జరిగిపోతూవుంటే అన్ని చిక్కులు వచ్చేవికావేమో? ఇందిరను యెప్పుడైతే తన యింట్లోకి మకాంమార్చాడో అప్పట్నుండి పరిస్థితులు విషమింపసాగాయి.

సావిత్రమ్మ నిజంగా ఓర్పులో భూదేవేనని చెప్పాలి. న్యాయరీతిగా తనస్థానంలో ఇందిర ఇంటికి యజమాని అయిందనే యీర్ష్యాసూయలెక్కడా లేవాసాధ్వికి. కాని ప్రతి చిన్నవిషయంలోకూడా ఇందిరమాటలు తన హృదయానికి శూలాలలాగా గుచ్చుకోసాగాయి. కొన్నిరోజులు తన దురదృష్టానికి క్రుళ్లిక్రుళ్లి యేడ్చేది. స్త్రీకిలభించవలసిన కనీసపుసౌఖ్యంగూడా భర్తనుండి దూరమైపోయింది. భర్త ఇందిరతో పడకటింట్లో సౌఖ్యం అనుభవిస్తుంటే ఆమె విడిగా పైటచెరగు పరచుకోని

విలపిస్తూవుండేది. పరిస్థితులంతటితో ఆగిపోలేదు. ఇందిర అని డను పనిమనిషికన్నా హీనంగా చూడసాగింది. ఆమె గర్వం యెంతగా పెరిగిందో కొంచెం కాళ్లుపిసకమని ఆజ్ఞాపించినపుడు తెలుస్తుంది. సావిత్రమ్మలో మాత్రం మానసత్వం, ఆత్మ గౌరవం వున్నప్పుడు వాటికి తగినరీతిగా సమాధానం చెప్పకుండా యేలావుంటుంది? ఆయన గారింటికి రానటంలో చే ఇందిర యేడుస్తూ, లేనిపోని నేరాలేవి చేవిటో సావిత్రమ్మమీద చెప్ప సాగింది. రామచంద్రంలో అక్కడక్కడవున్న ద్వేషమంతా కరుడు గట్టింది. సావిత్రమ్మను జుట్టుపట్టుకొని ఇష్టమొచ్చి నట్లల్లా బాదమోది, యీ యింట్లో ఒకక్షణమయిన వుండ టానికి వీల్లేదు బయటకు వెళ్లమని యింట్లోనుండి గెంటేసాడు.

ఆమె బయటకువచ్చిన ఆ అర్ధరాత్రి అక్కడక్కడా అరిచే కుక్కలు తప్పితే ప్రపంచమంతా మాటుమణగి నిద్రపోతూంది. సావిత్రమ్మస్థితి ఆలోచిస్తున్నకొద్దీ దుర్భరమయింది. భర్తపై నాకసి దీర్చికోవటమా? ఇందిరను యేలా యింట్లోనుండి గెంటి తిరిగి ప్రవేశించటమా? ఇటువంటి ప్రశ్నలసలామె మన స్సులో వుత్పత్తి కానేలేదు. పోనీ మనోవర్తికోసం భర్తమీద దావావేసి వేరే జీవిస్తూ వుందామా? ఈ ప్రశ్న, అసలు యిటువంటిదొకటి న్యాయంగా వుంటుందని గూడా ఆమెకు యిప్పట్లో తోచలేదు. ప్రస్తుతం ఆమెను ఆరాటపరుస్తున్న దల్లా, ఒకటే ప్రశ్న! భర్తకు పనికిరాని భార్య ప్రపంచంలో జీవించి యేంచెయ్యాలి? దీనికి యెంత ఆలోచించినా సమా ధానమే చిక్కటంలేదు. చివరకామె తేల్చుకొన్నదల్లా యేం

టంటే యిక జీవించటంవల్ల యేమాత్రమూ ప్రయోజనము లేదని.

సర్కారువారా నడివీధిలో కట్టించినబావి తనకోసమే యెదురుచూస్తున్నట్లు కన్పించినదావిడకాక్షణంలో. బావి చుట్టూ మూడుమార్లు ప్రదక్షణంచేస్తూ వచ్చేజన్మలోకూడా రామచంద్రమే తనకు భర్తగా గూర్చమని భగవంతుణ్ని ప్రార్థిస్తూ అందులో దుమికింది. గంగాభవానీగూడా నీలాంటి పతివ్రతను నాలో యిముడ్చుకోవటం నా అదృష్టమేనంటూ ఆమెను గ్రమింగింది.

తెల్లవారింది. కాకులు "కూకూ"మంటూ కూస్తున్నవి. ఇంకా అక్కడక్కడ వళ్లువిరుస్తూ నిద్రలేస్తూ వున్నారు. కొంత మంది. కాని రెక్కలాడితేగాని డొక్కలాడవనే వాళ్లుమాత్రం అప్పుడేలేచి తమతమ పనులలోకి దిగారు. చాలామందికి సర్కారుబావితో పనుండటంవల్ల నీళ్లు తోడుకుందామని వచ్చారు. అప్పటికే నీళ్ళమీద తేలుతూవున్న శవం చూచే టప్పటికి వాళ్ళకుగల్గిన భయాశ్చర్యాల కంతులేదు. చెడు వార్తలు నిప్పులాగా అంటుకపోతయి అన్న మాటమాత్రం నిజం. ఏలాగయితేనేం యీ వార్త పోలీసువాళ్ళ చెవులవరకు వచ్చింది. శవంమాత్రం సావిత్రమ్మదేనని నిర్ధారణయింది. పోలీసు రామచంద్రంగారిని స్టేటుమెంటియ్యమన్నారు. సావిత్రమ్మకు చాలారోజులనుండి మతి చెడిపోయివుంది. కాబట్టి బావిలో దుమికివుంటుంది. అంతకన్నా వేరే యేమీ కారణం లేదని ఆయన స్టేటుమెంటుయిచ్చారు. ఆ పేటలోవున్నయింకా

సల్లురయిదుగురు పెద్దమనుష్యులను సైతమూ అడిగారు. వాళ్ళు ఆ వార్తనే బలపరుస్తూ తమ స్టేటుమెంట్లను యిచ్చారు.

సావిత్రమ్మ సంగతి నిజం తెలిసినవాళ్లెవరూ లేరు, ఎప్పుడో అప్పుడు యీ అఘాయిత్యం జరిగి తీరుతుందని అందరకూ తెలుసు! పోనీ ఆ మెమీద నిజమైన అదరం జాలీ లేవాళ్ళంటే అదీగాదు. ఇందులోవున్న రహస్యం యేమంటంటే రామునం ద్రంతో పగ పామునగకన్నా అసాధ్యమయిందని తెలిసి తెలివితక్కువ వాళ్లెవరూ లేరు!

---

# "శ్రీమతిచేసిన చిన్న తమాషా"

ప్రక్కగా పోతున్న ప్లిమత్ కారు డ్రైవరు వేసిన సడన్ బ్రేక్ తో 'బాంయ్'మంటూ శబ్దం చేసికొంటూ ఆగిపోయింది. ఆ దెబ్బతో పరధ్యానంగా నడుస్తూవున్న ఆనందరావు ఆలోచనా ప్రవాహానికికూడా సడన్ బ్రేక్ పడింది. వెంట్రుకవాసిలో తప్పిపోయింది పెద్ద ప్రమాదం. జనం అంతా గుమిగూడారు. "ప్రతివారికీ వీధులలో నడుస్తూకూడా పెద్ద వేదాంతులలాగా ఆలోచించుకొంటూ నడవటమూ కారు ప్రమాదాలు జరుగుతున్నవి అని మమ్ములను కోర్టులకు యీడ్పించటమూ పరిపాటయిపోయింది" అంటూ డ్రైవరు తిరిగీ కారు నడుపించుకొని పోయాడు.

ఆనందరావు తిరిగి నడకసాగించాడు. ఆలోచనా తరంగాలు క్రిందికీ పైకీ పొంగుతూనే వున్నాయి అతని మెదడులో. అంత తీవ్రంగా ఆలోచిస్తూ నడవటానికి కారణం లేకపోలేదు అతనికి. తన పేరు తలచుకొని చిరునవ్వు నవ్వుకొంటాడు తనలో తానే నేతిబీరకాయను గుర్తుకు తెచ్చుకొని. ఆనందరావు ప్రథమశ్రేణిలో ఎం. ఎ. పట్టం పుచ్చుకొన్న యువకుడు. అతడు పడినవన్నీ బాధలే. అతని విషాధ గాథలు వేదనా శకలాలు. కాని, 'కావడి కొయ్యే కుండలు మన్నే' అనే వేదాంతం లోకి దిగాడు – చివరకు.

కాని యివాళిటి ఆనందరావు పరిస్థితి వేరు. అతను వెళుతున్నది సర్వీసు కమీషను ఆఫీసుకు. కొన్ని దినాలక్రిందట అతను పదవసారి కూర్చొన్న కాంపిటీటివ్ పరీక్షల ఫలితాలు యివాళ తెలుస్తాయి ఆఫీసులో. ఆ ఫలితాలమీదనే ఆధారపడివున్నది అతని జీవితం అంతా. అతడు అందులో నెగ్గితే గెజిటెడ్ ఆఫీసరు అయికూర్చుంటాడు ఒకేసారి. అందుకనే అంతగా ఆలోచిస్తూ నడుస్తూవున్నది. ఇప్పుడు అతని మెదడులో జరుగుతున్నది యీ సంగ్రామమే. ఆలోచనలు ఒకదానివెంట ఒకటి పరుగిడుతున్నాయి పాదరసంలాగా. మిగిలిన ఒకేఒక చార్మినార్ సిగరెట్టును బైటికితీసి ముట్టించాడు. ఒకవేళ ఆఫీసరు అయిపోతే తన శ్రీమతి యెంత ఆనందిస్తుందో. పాపం తనకోసం యెన్ని కష్టాలుపడుతున్నది యిప్పుడు. అప్పుడు తను యెంత గారంగా చూచుకొంటాడో. ముద్దులు మూట

గట్టే మూడేండ్ల బాబు! బాబుకు తను సైకిలు, గుర్రిం యెన్ని కొంటాడో? నిజంగా తనకా అంత అదృష్టం? ఇది రాకపోతే వేసినచోటనే వున్న గొంగళే అతని పని. ప్రతి వుదయమూ తనకు మేలుకొలుపులు చెప్పే వైతాళికులు— పాల మనిషి, అంగడివాడు, గృహ యజమాని, చాకలి... నగ్గరాలు...తనూ. ఆ జీవితానికి అంతువుండదు. ఇలా ఆలోచిస్తూ సర్వీసు కమీషను ఆఫీసులోకి చిరిగిన చొక్కా-భాగం పైకి అగుపించకుండా ఫాంటులోకి దోపుకొంటూ అడుగెట్టాడు ఆనందరావు. ఆనందరావు ఆనందానికి అంతులేదు. తనకండ్లను తను నమ్మలేకపోయాడు. నిజంగానే ఆఫీసరు అయిపోయాడు. మనసు మనో వాయువేగాలను అధిగమించింది. శ్రీమతి యెంత సంతోషిస్తుందో. యింటికి పరుగులెత్తాడు ఆనందరావు.

ఆనందరావు ఆశ్చర్యానికి అంతులేదు. యింటికి వచ్చేటప్పటికి సీతాకోక చిలుకలా తయారయిన శ్రీమతి కలకలలాడుతూ కిలకిల నవ్వుతూ ఆహ్వానించింది. ఎలా తెలిసిందో యీ శుభ వార్త శ్రీమతికి. తనకు వున్న ఒకేఒక జార్జెటు చీరె తీసి శృంగారించుకొన్నది. ఎవరినోటా యేమాటా పలకలేదు. భోజనానికి లెమ్మన్న శ్రీమతి మాట విని నివ్వెరపోతున్న ఆనందరావు కాళ్లు కడుక్కొని వచ్చి పీటమీద కూర్చొన్నాడు. విందును చూచి వింతపడ్డాడు. ఇదివరకు వాసనలు ఆఘ్రాణించి తృప్తినిజెందే ఆనందరావు లడ్డూ, ఆవడ, పులిహోరలతో విందు ముగించాడు. భోజనానంతరము శ్రీమతి తాంబూల

ముతో పాటు మడతపెట్టిన ఒక కాగితంముక్క యిచ్చింది. అందులో "విజయంతో సేంచేసిన శ్రీవారికి—బహుమతి" అని వ్రాసివుంది. రానురాను అగమ్యమయిపోయింది. అతని స్థితి. ఆ పరీక్షలో నెగ్గిన ఆనందరావు యీ పరీక్షలో తప్పి పోయాడు.

మెట్లు యెక్కుతూవున్న ఆనందరావు శ్రీమతి ఒక చిన్న కాగితం మడతపెట్టి మూలగా విసిరివేయడం చూసి చూడ నట్లే నటించాడు. బాబును యెత్తుకొని శ్రీమతి పైకి వెళ్ళింది. పిల్లిలాగా అడుగులు వేసుకొంటూ వెళ్ళి ఆ కాగితంముక్క మడతను విప్పిచూచాడు అందులో. "రాకపోతేపోయింది. వెధవ వుద్యోగం, దీనితాత యింకొకటివస్తుంది. దిగులుపడ కండి" అని వ్రాసివున్నది.

ఆనందరావుకు అర్థం అయింది శ్రీమతి చేసిన తమాషా. హుషారుగా పాడుకొంటూ మెట్లు యెక్కిన ఆనందరావును చూచి పకపక నవ్వింది శ్రీమతి. "అమ్మదొంగా, తెలిసిం దిలే నీ నాటకం" అంటూ శ్రీమతి ముద్దాడుతున్న బాబును పోటీగా తనుకూడా రెండవ చెంపకు ప్రయత్నించాడు. కొంటె బాబు ప్రక్కకు తప్పుకోవటంతో యిరువురి పెదవులు కలి సాయి. ఉన్న ఒకేవొక జార్జెటుచీరె నలిగిపోతుందని శ్రీమతి పెట్టుకొన్న వైర్యం వృథా కానేఅయింది.

VARUDU KAVALENU Re. 1/-

# వరుడు కావలెను

ప్రజామోదంపొందిన ఎనిమిది పసందైన కథలు.

భార్యాభర్తలు : నిత్యజీవితంలో భార్యాభర్తల మనస్తత్వాలకి ఈకథ ఒక మచ్చుతునక.

నీలిజార్జెట్ : పెద్ద ఆఫీసర్లకు ఉండే అర్థికఇబ్బందులు అన్నీ ఇన్నీ కావు అదే ఈకథలో చిత్రింపబడింది.

ప్రణయజీవులు : ఒకరికోసం ఒకరు త్యాగం చేసిన యీ కథ గుండె లోతుల్ని తడవుతుంది.

విధివిలాసం : ఇంటికోసంలేని ఇల్లాలిని సృష్టించి అబద్ధం బలం చేసుకోడం కోసం — చంపేస్తాడు ..... ఆ అబద్ధమే నిజమై కూర్చుంది. తన జీవితంలో.

వరుడు కావలెను : కోటివిద్యలూ కూటికొరకే— కవీ, రవీ — ఈ ఇద్దరూ ఆడిననాటకం — గుళ్ళోలింగాన్ని మింగేవాడు ఒకడూ, గుడినేమింగేవాడు ఒకడూను — వీళ్ళమధ్య ఒక భువన మోహిని.

తలపుపిలుపు : తనకి ఆపత్సమయంలో ఆదునికు రెండువేలరూపాయలు సహాయంచేసిన స్నేహితుడనేనా వదలకుండా అతిమెలకువతో హంతకుణ్ణి పట్టుకుని తనవిద్యుక్తధర్మాని నిర్వర్తించిన డిటెక్టివు కథ.

తోడేలులోకం : డబ్బున్నవారు ఎన్నితప్పులు చేసినా వేలెత్తిచూపలేదుఈలోకం—మోసం అని తెలిసి వుండికూడా మొహమాటం లేకండా చెప్పలేదు.

శ్రీమతిచేసిన చిన్నతమాషా: కలకలలాడుతు కిలకిల నవ్వుతూ శ్రీమతి భర్తని ఆనందడోలికల్లో ఊపిన చిన్న తమాషా



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము